కాని భాషలేని వేషంకూడా ప్రమాదకరమే. టిష్యూ చీర కట్టుకుని, ఎత్తు జోళ్లు వేసుకొని, Vanity Bag పట్టుకుని, తక్కిన అన్ని మేకప్ లూ చేసికొని పదిమందిలోకి వచ్చి, కళ్లు మిరుమిట్లుకొలిపినా, పలకరించితే తగినట్టుగా మాటాడలేకపోతే ఎంతసేపు నిలబెట్టుకుంటుంది ఆమోజు? నగుబాటుపాలే గదా ఆ బ్రతుకు!

భాష కలిగితే, మొదటి చూపులోనే గౌరవం కలిగించుకోకపోయినా, తరవాత సత్కారం పడయగలరు గనుక, భాష కలిగి వేషం లేకున్నా, ఎక్కువ నష్టం లేదని కొందరంటారు. కావచ్చు నేమోకాని. "ఇలుమాసిన, ఒలుమాసిన, పలువలు మాసినను" అని, ఎంత ప్రజ్ఞావంతులైనా చీదరగా, మోటగా వుంటే వెలపరం కలగడం, శుచి శుభ్రాలు కలిగి నాగరికతగా మసలితే ఒక అధికారం కలగడం కూడా సహజమేగాదూ! ఎంతమంచి పుస్తకమైనా చీకిరిబాకిరి చిన్న అచ్చుతో, తప్పుల తడకగావుంటే చదవడానికి తలనొప్పి రాక మానుతుందా? స్ఫుటమైన అచ్చుతో, చక్కగా ముద్రించిన ప్రతిమీద అందరికీ ఆశగానే వుండదూ? (అయితే, అది స్వంతం చేసుకో గలిగిన సామర్థ్యం కొందరికే వుంటుంది!)

కనుక, భాషేకాక వేషంకూడా ముఖ్యమే. ఎవరికైనా భాషలేని వేషం, వేషంలేని భాషా రాణించవు. వేషభాషలు వ్యక్తులలో ఒక ప్రత్యేకత్వం ప్రస్ఫుటం చేస్తాయి. మొదట దృష్టి నరికట్టేదీ, ఆకర్షించేదీ వేషం. ఆ తరవాత ఆ ఆకర్షణని గట్టిగా నాటించి, స్థిరంగా నిలపగలిగింది భాష.

అయితే, వేషభాషలు ప్రాయాన్నిబట్టి, పరిస్థితులనుబట్టీ మార్చుకుంటునే వుండాలి. ఒకసమయంలో ఒప్పేది మరొక సమయంలో ఒప్పదు. ఒకరి కందమిచ్చేది మరొకరి కంద మివ్వదు.

ఏభై ఏళ్ళ అమ్మమ్మ పదిహేనేళ్ళ మనుమరాలిలాగ వాలుజడా, పాపడా, ఒల్లెవాటూ వేసుకుంటే, దృష్టి బొమ్మలాగుంటుంది కాని, దృష్టి తగిలే బొమ్మలాగుంటుందా? పనిలోకి వెడితే ఒకలాగ, బజారు తిరిగినపు డొక రకంగా, బీచికి వెడితే మరోవిధంగా సందర్భాన్నిబట్టీ, సమయాన్నిబట్టీ వేషభాషలు మార్చాలి. ఎవరితో మాట్లాడుతున్నదీ, ఎప్పుడు మాట్లాడుతున్నదీ, ఏమి మాట్లాడుతున్నదీ గుర్తించి, విచక్షణతో మాట్లాడాలి. అంతే గాని, పనిలోకి వెళ్ళినా, పరామర్శకు వెళ్లినా, పెళ్లికి వెళ్లినా ఒకలాగే కట్టుకుని, పసిపాపతోనూ, పనివాడితోనూ, పైఅధికారితోనూ ఒకలాగే మాట్లాడితే, అది భేషజం లేక పోవడం గాదు, సభ్యతా సంస్కారములు లేక పోవడం అనవలసి వస్తుంది.

ఏవయసులోవారైనా, ఏవిధమైనవారైనా కొందరిలో వేషభాషలు వారివారి అభిరుచులనీ, కళాశీలత్వాన్నీ, సంస్కృతినీ వెల్లడిచేస్తాయి. విలువైన పట్టుచీరలమీది అభిమానం, సెర్జి సూట్లమీది మోజు ఒకరకమైన అభిరుచుల్నీ, పల్చటి జాకెట్లు, వెంకటగిరి జరీకోకలూ, మల్లెపువ్వుల ఆహారం, ఉల్లిపొర ఉత్తరీయం మరొక రకమైన అభిరుచుల్నీ చాటి చూపిస్తాయి. మాటలుకూడా—సూర్యకిరణాల్లాగ చుర్రుమని నాటుతూ తాపం కలిగిస్తూనూ, చందమామ

చంద్రికల్లాగ చల్లగా స్పృశించి, తాప మపన యించి, హాయి గొలుపుతూనూ, వారి వారి సంస్కృతులని తేటతెల్లం చేస్తాయి

అంతేకాని, విలువైనవి కట్టినంతమాత్రాన పెద్ద పెద్ద డిగ్రీలు పొందినంత మాత్రాన వేష భాషలలో విశిష్టత రాదు.

ఒక్కొక్కరు పెట్టుకుని చుట్టుకున్న వాటన్నిటితోనూ నిలిపి వేలంపాడితే పదివేలు సులువుగా వచ్చినా, వాళ్ళువేప్పు బ్రతిమాలినా చూడబుద్ధవదు. ఒక్కొక్కరు కట్టినది అందరూ కట్టే నూలుబట్టే అయినా, అన్ని అలంకారాలు కలిపి అరడజను లేకపోయినా, వద్దన్నా, ఎవరు తప్పర్థం చేసుకుంటారన్నా తిరిగి తిరిగి వాళ్లనే చూడ మనసవుతుంది. కొందరితో రోజుల తరబడి కలసివున్నా, జ్ఞాపకముంచుకోతగిన మాటలే కనబడవు. కొందరితో కొన్ని నిముషాలు మాటాడినా, ఆ మధుర సంభాషణ ఆజన్మాంతం మరపు రాదు. దానికి వారి వేషభాషలలో వ్యక్తమయ్యే కళాశీలత్వమూ, సంస్కారమే కారణము.

సంస్కారము సిరిసంపదలతో కొనగలిగినది కాదు. కొందరు అదృష్టశాలుర కది పుట్టుకతోనే అంకురిస్తుంది. ఆతరవాత తిరిగే వాతావరణాన్ని బట్టీ, చేసుకొన్న అలవాట్లను బట్టీ, అభివృద్ధిలోనికి వస్తుంది. కాని ఎవ్వరైనాకూడా కోరికతో ప్రయత్నిస్తేనూ, విద్యా వ్యాసంగములవల్లనూ, కొంతవరకూ కళాభిరతి, సముచిత సంభాషణ అలవరచుకోవచ్చును.

నాగరిక మానవులమని చెప్పుకొనే ప్రతివారూ తగిన వేషభాషలతో మసలడం తప్పక అలవరచుకోవలసినదే !



## గమనిక

1. రచయితలు తమ వ్యాసములను కాగితమున కొక పక్కనే విడమర్చి వ్రాయవలెను.
2. ఏ వ్యాసమయినను కిన్నెర సైజున అచ్చులో నాలుగు పుటలకు లేదా ఆరు పుటలను మించి వుండకూడదు.
3. ప్రకటన కాని వ్యాసములు పోస్టేజి స్టాంపులు పంపితేనేకాని తిరిగి పంపబడవు.
4. పద్యాలు, గేయాలు ప్రకటింపబడవు.

# బ్రతుకు తీపి

శ్రీమతి ఆచంట శారదాదేవి

అమ్మ ఏదో చెపుతూనేవుంది. "పోనీలేమ్మా, నీ వళ్ళు నయమై ఇంటికొచ్చావు. అంతే చాలు." అంటూ ఇంకా ఏవో ఏవో....

—తను ఒక్కటీ వినిపించుకో లేదు. ప్రపంచమంతా ఒక్కసారి చలనం లేకుండా స్థాణువులా నిలిచిపోయి నట్లయింది. హృదయంలో క్రమ్ముకున్న శూన్యం జగమంతా ఆవరించుకున్నది.

ఏదో ఆలోచన: "ఇందుకోసమేనా ఇంటికి వచ్చాను? ఇందుకేనా ప్రాణాలకోసం ఇంత పెనగులాడిందీ?"

మళ్ళీ మళ్ళీ ఇదే ఆలోచన గంటకొట్టినట్లు తల్లో తిరిగింది. తూలుతూ నిద్రలో లేచి నడిచినట్లు గుమ్మందాకా వెళ్ళింది. ఏదో అలవాటుగా తనకు తెలీకుండానే అన్నది:

"అమ్మా, అల్లా కొంచెం దూరం షికారు వెళ్ళివస్తాను."

అమ్మ ముఖంలో ఎక్కడలేని ఆత్రుత, భయమూ కనుపించాయి. తన్ను ఆపాలని ఎంతో ప్రయాస పడుతున్నట్లు కనుపించింది. కాని మళ్ళీ ఆపడానికి ప్రయత్నించలేదు. తను ఆగనూలేదు.



అల్లాగే అంతులేకుండా నడుస్తూ వెళ్ళింది.

అప్పుడే వర్షం కురిసి వెలసింది. వర్షాకాలంలో ఈ ఊరు ఎంత బాగుంటుదో, త్రోవ పొడుగునా ఎన్నో రకరకాల పువ్వులు! చల్లగాలికి ఆనందంతో మెల్లమెల్లగా ఊగిపోతున్నాయి—నీటి ముత్యాలు రాలుస్తూ, ఎరుపు, నీలం, పసుపూ ఎన్ని రంగులో! దూరాన కొండలు నీలంగా ఆకాశాన్నంటుకుంటూ చుట్టూ గిరి గీసినట్లున్నాయి—నీరెం

దశో విచ్చిత బయళ్ళు తళతళ లాడుతున్నాయి. ఎంత ప్రశాంతంగా ఉంది. ఏమాత్రం జన సంచారం లేకుండా! కాని తనకు తోడుగా ఉంటుందని వెనకాలే అమ్మ లక్ష్మిని పంపు తుందేమో? వెనక్కి తిరిగి చూసింది. ఎవ్వరూ లేరు; అమ్మయ్య!

ఎంత సేపు నడిచిందో....ఇల్లాగే అంతు లేకుండా నడుస్తూవుంటే ఎంత బాగుండును! ప్రపంచమంతా ఎప్పుడూ పువ్వులతో, వర్షపు బిందువులతో, ఇల్లాగే ప్రశాంతంగా, మనోహరంగా, వుంటే ఎంత బాగుంటుంది!....

క్రమంగా తను శానటోరియమ్‌కు వెళ్ళడం, ఒక రోజూ రెండు రోజులూ కాదు, ఎనిమిది నెలలు బాహ్యప్రపంచంతో సంబంధంలేకుండా బందీగా జీవితం గడపటమూ; అన్నీ ఒక్కొక్కటిగా పూసగ్రుచ్చినట్లు జ్ఞాపకం వచ్చినాయి. అబ్బా! ఈ చల్లని గాలికోసం, ఈ పచ్చని పువ్వులకోసం, వెన్నెలకోసం, స్వేచ్ఛకోసం, ఎంత పరితపించింది! అందరిలాగే తనూ జీవించివున్నానని, జీవిస్తున్నానని అనుకోవాలని ఎంత ఆరాటపడింది!

ఆవేళ మామయ్య వచ్చాడు. అప్పటికి తను శానటోరియమ్‌కు వచ్చి మూడు రోజులే అయింది. కాని, తనకు ఆ మూడు రోజులే మూడు యుగా లనిపించింది—తెల్లని దుస్తులతో మెషీన్లలా తిరిగే నర్సులు, నెత్తిమీద విధీ విసుగూ లేకుండా తిరిగే ఫాను, చూసి చూసి విసుగుపుట్టింది. ఏమీ తోచక, రోజంతా కిటికీ దగ్గరే కూర్చునేది. కిటికీకి ఎదురుగానే ఎన్నో పెద్దపెద్ద చెట్లు దగ్గర దగ్గరగా పైనుంచి పచ్చని పందిరిలా వుండేవి. దూరాన బోర్డింగు స్కూలు గేటుమాత్రం కనుపించేది. రోజంతా ఎందరో పిల్లలు నవ్వుతో, అరుస్తో, అల్లరి చేస్తూ అటూ ఇటూ తిరుగుతూ వుండేవాళ్లు. ఎంత స్వేచ్ఛగా వుండేవాళ్లు! వాళ్లని చూసి నప్పుడల్లా తన కళ్లు చెమ్మగిల్లేవి. మళ్లీ ఒక్కొక్కప్పుడు, తనూ వాళ్లతో తిరుగుతూ వున్నట్టే వుండేది తనకు. కాని, నర్సు తనకి ఆమాత్రం స్వేచ్ఛకూడా ఇవ్వదలచుకోలేదు.

ఓరోజు మందలించింది: "ఎప్పుడూ కిటికీ దగ్గరే కూర్చోకూడదమ్మా? చల్లగాలి నీవంటికి మంచిది కాదు."

స్వయంగా వచ్చి కిటికీ మూసేసింది;—ఆకాస్త ప్రపంచం దూరమైంది.

ఆవేళ మధ్యాహ్నంఅంతా ఏమీ తోచ లేదు. ఉండి ఉండి ప్రక్క గదులలోనుంచి భరించిలేని బాధతో మూలుగులు వినిపించేయి. తనకి పిచ్చెత్తినట్లయింది. బయట అందాన్ని, ఆనందాన్ని వెతుక్కుంటూ నలుగురితో కులాసాగాఆడుతో, పాడుతో. ప్రపంచంలో బాధ వున్నదనే మరచిపోతుంటాం. కాని, ఇక్కడ నిరాశ, నిస్సహాయత, బాధ, నిస్పృహ, అన్నీ ప్రోగుచేసి కుప్ప పోసినట్లయింది. ఆగి ఆగి వచ్చే ఈ ఆర్తనాదాలు ప్రపంచపు దుఃఖ చరిత్ర, శంఖం వూది వినిపిస్తున్నట్లుంటుంది. అబ్బా!—ఎక్కడికో పారిపోవాలనిపిస్తుంది. వేరే ధ్యాసలేకుండా ఇక్కడే వుండడం ఎంత బాధ!

ఆరోజుసాయంత్రమే మామయ్య వచ్చాడు. వస్తూనే గది నాలుగు మూలలా చూస్తూ

అన్నాడు: "ఆయువు బాగుంటే గాయంఅంత సుఖం లేదుసుమా!" తెచ్చిపెట్టుకుని నవ్వాడు.

తెల్లబోతూ, కోపంతో అన్నది తాను :

"అదేమిటి మామయ్యా, అల్లా అంటావు?"

ఆయన అన్నాడు: "అవునమ్మా, ఈ గదీ అదీ చూడు. ఎంత దర్జాగా వున్నదో! పైగా అందరూ ఇప్పుడు నిన్ను ఎంత శ్రద్ధగా చూస్తారు!"

ఏమి అర్థంలేని మాటలు! ఊరికే తనని ఓదార్చడానికే అంటాడేమో! ఈగది బాగుంది; ఈ పరుపు బాగున్నది; ఇక్కడ నర్సులందరూ చాల మంచివాళ్లు; నీకు త్వరగానే నయమవుతుంది; వచ్చినప్పటికన్నా ఎంత ఆరోగ్యంగా వున్నావు!—అబ్బా! ఎన్ని అబద్ధాలు చెప్పుతారో తనకోసం! తనని సంతోషపరచాలని ఎంత ప్రయాస పడుతారో!

అందరూ అంతే! తమ మాటలు వింటో ఈ దిక్కులేనివాళ్లంతా మోసపోతారనే వారి ఉద్దేశం.

తనకి తెలుసు తన ఆరోగ్యం బాగాలేదని. ఎంతో శ్రమపడితేనే గాని తనకి నయం కాదని! అయినా తనకి త్వరలోనే ఆరోగ్యం కలుగుతుంది! తనలోని అణువు అణువు ఆరోగ్యంకోసం పరితపిస్తోంది! తన హృదయంలో ప్రతి ఒక్క కోరికా తన ఆరోగ్యాన్నే చుట్టుకు తిరుగుతున్నది.

తనకోసం, బావకోసం తనకు తప్పకుండా నయమవుతుంది. ఎన్నిరోజులైనా బావ తన కోసం కనిపెట్టుకుని వుంటాడు. బావకీ తనకీ పెళ్లవుతుంది. తమ జీవితమంతా పువ్వులతో నిండిపోతుంది. ఈ ఆశే తనకి ప్రాణం పోస్తోంది.

అబ్బా! ఈ జీవితాన్ని ఎంతగా ప్రేమిస్తున్నది! జీవితానికి దూరమైనప్పుడే తెలుస్తుంది జీవితం ఎంత ప్రియమైనదో! అస్తమిస్తోన్న సూర్యుడిని చూస్తో, నది అంచున బావా తనూ ప్రొద్దు వాలేవరకూ ఇసుకలో ఆడుకోవడం; వెన్నెలరోజుల్లో పడవ షికారు వెళ్లితే, చల్లగాలిలో నీళ్లు చింది తన బుగ్గల నిండా పడడం; రాత్రి సినిమానుంచి వస్తుంటే వర్షంలో బావ పట్టుకండువా తనమీద కప్పడం; ఇల్లా ఎన్నో—మధురమైన జ్ఞాపకాలు, కస్తురి తావిలాగ తన హృదయాన్ని చుట్టుకొంటున్నాయి.తనకి జీవితమందు ఆశ కలిగిస్తున్నాయి!

ఇంకా ఎన్నో—జీవితంలో అందమైనవి! రంగురంగుల పువ్వులు; సన్నని సరిగంచు వల్లెలు; మధుబాల నవ్వు; సైగల్ పాటలు; ఎడతెగని పుస్తకాలు; దూరమైనకొద్దీ మరింత ప్రియమౌతాయి! ఎన్నిరకరకాల పరిమళాలతో నింపుకొంటాయో ఈ జీవితాన్ని! బ్రతుకు తీపి ఎప్పటికీ వదలదు.

....తనకు తప్పకుండా నయమౌతుంది!

ఎంతమంది వచ్చేవారో తనని చూడడానికి శానటోరియమ్‌లో. ఎన్నిరకాల ప్రకృతులు, కాని, ఒక్కరూ మూడు నిమిషాలకన్న ఎక్కువ కూర్చున్నట్లు జ్ఞాపకం లేదు. డ్యూటీగా వచ్చి, ముళ్లమీద ఉన్నట్లు వుండి, వెళ్లిపోయేవారు.

అవును. జీవితానందంలో మునిగి తేలేవారు మృత్యువుకు సమీపంగా వున్నవాళ్ల దగ్గర ఎక్కువసేపు కూర్చోలేరు! వారిని గురించి ఎక్కువ ఆలోచించలేరు! వెలివేసినట్లు తనెంత బాధపడేదో! ఎంత ఒంటరితనాన్ననుభవించేదో! ఎవరికి అర్థమౌతుంది?

ఆఖరుకి, బావకూడా ఎక్కువగా రాలేదు. ఒక్కసారి మాత్రమే వచ్చాడు. రెండు నిమిషాలకన్న ఎక్కువ వుండలేదు. ఏవో రెండు పొడిమాటలు మాట్లాడి వెళ్లాడు. మళ్లీ రానే లేదు. అమ్మ చెప్పేది: "అతను నువ్వు బాధ పడుతూవుంటే చూడలేడమ్మా, అందుకని రాడు. నువ్వింక త్వరగానే ఇంటికొస్తావు గదూ! "

అవును పాపం; బావది ఎంత సున్నితమైన హృదయం! ఏమాత్రం బాధ అయినా చూడలేడు. అణుమాత్రమైనా అందవికారాన్ని సహించలేడు—మొదట బావ తరుచు ఉత్తరాలు వ్రాసేవాడు. పెద్దపెద్ద ఉత్తరాలు, ఎంతో ప్రేమతో, ఎంతో ధైర్యంచెబుతో! ఆ తరువాత క్రమంగా ఉత్తరాలే రాలేదు. అమ్మ ఎన్నో సాకులు చెప్పేది.

"అతనికి పరీక్షలటమ్మా, చదువుకుంటున్నాడుట. ఏదో ఉద్యోగంకోసం తిరుగుతున్నాడటమ్మా,ఢిల్లీ వెళ్లాడుట.వచ్చాక వ్రాస్తాడేమో!" ఇట్లాగే ఇంకా ఏవో ఏవో;తను అన్నీ నిజమనే నమ్మింది.

ఓసారి, పిన్ని తనని చూడటానికి వచ్చింది. ఎంతో ఆప్యాయంగా దగ్గర కూర్చుని ఎన్నో ప్రశ్నలు వేసింది. తన కేమీ ఉత్సాహం కలుగదులే. తనకి నయం కాకపోతే పిన్ని కూతురు రజనిని బావ పెళ్లి చేసుకోవచ్చు. కూతురి వివాహానికీ, తన ఆరోగ్యానికీ వున్న సంబంధం ఆవిడకు తట్టకుండా వుంటుందా? ఈనిమిషంలో మాత్రం ఆమె అదే ఆలోచిస్తూవుండకూడదూ? స్వార్థాన్ని పూర్తిగా మరచిపోగలరా? తనకు నమ్మకం కలగలేదు.

"రజని కాలేజీలో చేరిందా?"

"బావ కాలేజీలోనేనా?"

ఏవేవో అర్థంలేని ప్రశ్నలు వేసింది తను. పిన్ని కలవరపడింది, ఒకవేళ బావ రోజూ రజనిని కనుసుకుంటూ వుండొచ్చు.

ఎవరు వచ్చినా ఎవరు రాకపోయినా, అమ్మ, లక్ష్మి రోజూ వచ్చేవారు. తనతోపాటు ఖైదీల్లా కూర్చునేవారు. అమ్మ ఎంత శ్రమపడేది! ఎన్ని కబుర్లు చెప్పేది. మాటలతో, ప్రేమతో తనకు జీవం పోసింది. తనకు ఎల్లాగైనా ఆరోగ్యం కలగాలని అమ్మ పట్టుపట్టింది.

తూగుతూ, లేస్తూ, జీవితాన్ని గురించి కలలుకంటూ రోజులు గడిచేవి. నర్సు మాత్రం మధ్యమధ్యన మందివ్వాలనో, టెంపరేచర్ చూడాలనో, ఏదో వంకతో వచ్చివెళ్లేది. ఓ రోజు నిద్రలేపి చెప్పింది :

"రేపు ఇంటికెళ్లొచ్చు." డాక్టరు చెప్పింది.

తనకి నమ్మకం కలుగలేదు. నిజమే! నిజంగానే! తనలో ఉత్సాహం కట్టలు తెంచుకొని ప్రవహించింది, అణువు అణువులో క్రొత్త చైతన్యం కలిగింది. ఏనిమిషం వెలలకి తనకి

విముక్తి దొరికింది. తనూ నలుగురిలో మనిషి ననిపించుకోవచ్చు.

ఇంటికి వచ్చినరోజే బావ వస్తాడనుకుంది. రాలేదు, రెండోరోజూ రాలేదు. మూడోరోజూ రాలేదు. తనకేదో నిరాధారంగా అగాధంలోకి కృంగిపోతున్న ట్లనిపించింది. శానటోరియమ్ లో ఉన్నన్నాళ్లూ బయట జీవితమంతా ఒక మధుర స్వప్నంలా తోచేది; కాని, ఇక్కడా ఆశ, నిరాశ, ఒంటరితనం. శూన్యతా—ఇవే.

నాలుగో రోజు బావ ఉత్తరం వ్రాశాడు తనకు వళ్లు నయమై ఇంటికి వచ్చినందుకు ఎంతో సంతోషిస్తున్నానని—అంతే!

ఆతరువాత అమ్మ చెప్పింది: "బావ రజనిని పెళ్లిచేసుకునీ చాల రోజులైంది."

నిజమే! తను నమ్మలేకపోయింది. అమ్మ ఇంకా చెపుతూనే వుంది :

"నీకు నయం కాదనుకున్నారమ్మా. అత్తయ్య పట్టుపట్టింది. బావకు తప్పలేదు. అదీ మేనరికమే గదా అనుకున్నారు. అవును. ఎన్నాళ్ళని కనిపెట్టుకుంటారమ్మా. నీవు బాధపడుతావని ఇన్నాళ్లూ చెప్పలేదు. ఇంటికి వచ్చాక చెప్ప వచ్చనుకున్నాను. పోనీలేమ్మా, నీకు నయమైంది అంతేచాలు.''—ఇంకా ఏవేవో —తను వినిపించుకోలేదు, బొమ్మలా నిలబడి పోయింది....

అబ్బ! ఎంత దూరం నడిచింది! ఇంక ముందుకు వెళ్లలేకపోయింది. అలసిపోయి తిరిగి ఇంటివేపు నడిచింది.

అమ్మ తెలిసే తనకు చెప్పలేదు. తెలిసే తనని మోసం చేసింది. అబ్బా! తనకి తెలిస్తే తను నిరాశతో, బాధతో కృంగిపోతుందేమో నని, తన కింకెప్పటికీ ఆరోగ్యం కలగదనీ భయపడిందేమో, పాపం! ఎంత మమకారమో!

అబ్బా! ఎంతసేపని నడుస్తూవుంటుంది! ఈ కాస్తదూరం గడిచిపోతుంది! మళ్లీ ఆ ఇంట్లోకే వెడుతుంది! మళ్ళీ అదే చీకటి. అదే నిరాశ!

ఉన్నట్టుండి, చల్లగాలికి రాలిన పూవొకటి ఎగిరి కాలిమీద పడింది. వంగి చేతిలోకి తీసుకుంది. ఎంత అందమైన పువ్వు! ఎంత మంచి వాసనో!

కళ్లకద్దుకుంది. కళ్లు చెమ్మగిల్లాయి.

ప్రొద్దు వాలుతోంది! కిలకిలమంటూ పక్షు లన్నీ గుంపులు గుంపులుగా గూళ్ళకు పోతు న్నాయి. ఎక్కడో, ఏచెట్టుమీదో, ఏగూట్లోనో, బెదరుతూన్న కళ్లతో తల్లికోసం ఎదురుచూసే పసికూనలు స్ఫురణకు వచ్చాయి. కళ్లు తుడుచుకుంది.

పోనీ, బావ ఎక్కడో సుఖంగా వుంటే సరి! తనకింకేం కావాలి! తను ఇప్పుడు ఆరోగ్యంగా వున్నదిగదా! తను మళ్లా చదువు కుంటుంది. ఎమ్. ఎ. దాకా చదువుకుంటుంది. తనకోసం అమ్మ ఎంత శ్రమపడుతుంది! ఆవిడ కోసం తను సంతోషంగా వుంటుంది. తను— తనకే నవ్వొచ్చింది.

నిండు ప్రవాహంలో మునిగిపోతున్న వ్యక్తి కూడా ఒడ్డుకు చేరడానికి పూచికపుల్లయినా దొరుకుతుందేమో నని వెతుక్కుంటాడు. తను జీవించడానికి వంకలు వెతుక్కుంటు న్నది. బ్రతికివుండడానికి ఏదో వంక కావాలి. ఏదో ఆసరా దొరకాలి. ఈ జీవితమంటే ఎంత ప్రేమో!

....గుమ్మం ఎక్కుతూ పువ్వు తల్లో పెట్టుకుంది.



ఐక్యరాజ్యసమితి పతాకాన్ని ట్రిగ్వీలీ (కుడివైపు) సంయుక్తరాజ్యాల
ప్రతినిధియైన వారెన్ ఆస్టిన్‌కి బహూకరిస్తున్నాడు. కొరియాలో
శాంతి ఏర్పడువరకు మెక్‌ఆర్థర్ ప్రధాన కార్యస్థాన
మందు ఈ పతాకం ఎగురుచుండగలదు.

కిన్నెర ప్రతులను అమ్ముటకు ఏజంట్లు లేనిచోట్ల
ఈ క్రింది షరతులపైన ఏజంట్లు కావాలి

# ఏ జ న్సీ ష ర తు లు

1. ప్రతి ఏజెంటూ నెలకు కనీసం 6 కాపీలు తెప్పించాలి. అమ్మకం కాని కాపీలు వాపసు తీసుకోబడవు.
2. ఏజెంట్లు తమ ఏరియాలోనే "కిన్నెర"ను అమ్మాలి.
3. సంచిక వెల ఎనిమిది అణాలు. ప్రత్యేక సంచిక వెల ఆయా ప్రకటనకాలమందు నిర్ణయించబడుతుంది.
4. ఏజెన్సీ కమీషను నూటికి 25 చొప్పున ఇవ్వబడుతుంది
5. ప్రతినెలా ఏజెంట్లు తమకు కావలసిన కాపీలకు 10-వ తేదీలోపున అందునట్లు ఆర్డరు పంపాలి.
6. ఆర్డరుతోబాటు తమకు కావలసిన కాపీలకు కమీషను మినహాయించి సొమ్ము పంపవలెను.
7. పత్రికలు పంపడానికి పార్సెలు ఖర్చులు, పోస్టుఖర్చులు చార్జీ చేయబడవు. చెక్కులకు మనియార్డర్లకు అయ్యే కమీషను ఏజంట్లే భరించాలి.
8. చందాదార్లను చేర్చడానికి ఏజంట్లకు అధికారంలేదు.

టెలిగ్రాఫ్సు : "రీటా" టెలిఫోన్ : 55068

మేనేజరు, కిన్నెర

16, జోన్సువీధి, మద్రాసు 1

# చంద్రశేఖర వేంకట రామన్

శ్రీ ఏ. వి. ఎస్. రామారావు

**1914** వ సంవత్సరంలో కలకత్తా విశ్వ విద్యాలయ "సెనేట్" సభలో ఉపన్యసిస్తూ తారకనాథ పాలిత్ యేర్పరచిన పదార్థవిజ్ఞానాచార్య పీఠాన్ని అలంకరించే టందుకై చంద్రశేఖర వేంకట రామన్ అంగీక రించుట చాలా గొప్ప విషయం. ఊపిరి తీసి కొనుటకైనా తీరికనివ్వని ఉద్యోగాన్ని చేస్తూ కూడా, ప్రతికూలమైన పరిస్థితులలోనే భౌతిక శాస్త్రాలలో ఘనమైన పరిశోధనలు చేసి ఆయన ఖ్యాతి గాంచినాడు. ఆ పరిశోధనలకై ఐరోపీయ దేశాలు కూడా ఆయనను ఎక్కువగా నుతించి నవి. మన దేశంలో ఆధునిక విజ్ఞాన బీజాలను నాటి, వాటి యభివృద్ధికై తన జీవితాన్నంతని అర్పించిన మన సహచరుడు, కీర్తిశేషుడైన మహేంద్రలాల్ సర్కార్ లనెకొల్పిన "ది ఇండి యన్ ఎసోసియేషన్ ఫర్ ది కల్టివేషన్ ఆఫ్ సయన్సు" యొక్క పరిశోధనాగారములలోనే అమూల్యములైన తన పరిశోధనలనన్నింటిని రామన్ గావించేడని స్ఫురణకు తెచ్చుకొనుసరికి నాకు చాలా ఆనంద మగుచున్నది. మంచి హోదా, ఎక్కువ జీతముగల ప్రభుత్వోద్యోగాన్ని వదలుకొని అధిక వేతనమైనా లేని విశ్వవిద్యలయాచార్య పదము స్వీకరించుటకై నిశ్చయించుకొనుటలో రామన్ ప్రదర్శించిన త్యాగసాహసాలకు నేను వాస్తవంగా పొందిన



ఆనందాన్ని పైకి వ్యక్తిపరచకుండా మనస్సు లోనే కప్పిపుచ్చుకొని యుంటే నా విధిని నిర్వర్తించుటలో నేను గొప్ప తప్పిదము చేసిన వాడనగుదునని సర్ ఆశుతోష్ ముఖర్జీ ఉగ్గడించి నాడు. సర్ ఆశుతోష్ సాధారణ వ్యక్తిగాడు. ఉన్నతాశయమండితుడు. భారతదేశ పునరభ్యు దయాన్ని కాంక్షించికృషిసల్పిన మహామనీషి. స్వరాష్ట్ర పరరాష్ట్ర భేదములులేక భారతదేశ సౌభాగ్యాన్నే పరమలక్ష్యంగా నేర్పరుచుకొని, దేశంలో ప్రతిభా సమన్వితులైన వారినందరిని

ఏరి కలకత్తా విశ్వవిద్యాలయ కళాశాలలో చేర్చిన ప్రజ్ఞానిధి.

క్రొత్తగా స్థాపించ సంకల్పించుకొన్న కలకత్తా విశ్వవిద్యాలయ శాస్త్ర కళాశాలలో పదార్థ విజ్ఞానాచార్య పదవిని స్వీకరింపుమని వేంకట రామన్‌ను సర్ ఆశుతోష్ ఆహ్వానించు సరికి రామన్‌కు ఇరువదియారు సంవత్సరాలు కూడ పూర్తిగా నిండలేదు. అప్పుడాతడు భారత ప్రభుత్వపు టార్థిక శాఖలో ఉన్నతోద్యోగిగా పనిచేస్తూ, తన తీరిక సమయాలలో "ఇండియన్ ఎసోసియేషన్" ప్రయోగశాలలో శాస్త్రపరిశోధనలు చేస్తుండేవాడు. రామన్‌తో పరిచయం, ఆతని శాస్త్రప్రతిభను చవిజూచే అవకాశం ఆ సమయంలోనే సర్ ఆశుతోష్‌కు కలిగినవి. తగు అవకాశాలను కల్పిస్తే రామన్ భావిజీవితము మహోజ్జ్వలమై వెలుగొందుట తథ్యమని తత్ఫలితంగా శాస్త్రప్రపంచంలో భారతదేశ ప్రతిష్ఠ కూడ ఇనుమడించుట రూఢి యని ఆయన సూటిగా గ్రహించి శాస్త్ర కళాశాలలో పదార్థవిజ్ఞానాచార్య పదవిని స్వీకరింపుమని వేంకట రామన్‌ను కోరినాడు.

చెన్నపురిలోని రాజధాని కళాశాలలో ఎం. ఏ. పరీక్షకై చదువుచున్నప్పుడే శబ్ద తేజశ్శాస్త్రాలలో కొన్ని పరిశోధనలు చేసి, ఆ ఫలితాలను ఆంగ్లవిజ్ఞాన సంచికలలో వేంకట రామన్ ప్రచురించినాడు. ఎం.ఏ. పరీక్షలో ఉత్తీర్ణతను పొందిన పిమ్మట ఉన్నత శాస్త్రవిద్యాభ్యాసానికై ఆంగ్లదేశమున కేగవలయునని వేంకట రామన్ సంకల్పించినాడుగాని ఆరోగ్య కారణాలచే నది వీలుపడలేదు. ఆరీతిగా తన ఉన్నత శాస్త్రవిద్యాభ్యాసానికి ఆటంకము వచ్చుటచే ఆరోజులలో ప్రతిభావంతుల కందరకును అందుబాటులోనున్న ప్రభుత్వపు టార్థిక శాఖా పరీక్షకు హాజరై అందు త్తీర్ణతను బొంది, 1907వ సంవత్సరం జూన్ నెలలో కలకత్తా నగరమున అసిస్టెంటు అక్కౌంటెంట్ జనరల్‌గా ఆయన ఉద్యోగమున ప్రవేశించినాడు.

కలకత్తా నగరంలో ఉద్యోగం చేస్తుండగానే ఇండియన్ ఎసోసియేషన్‌లో సభ్యుడుగా చేరి తన తీరిక సమయాలలో ఆ సంస్థాపరిశోధనాగారాలలో పరిశోధనలు చేస్తుండేవాడు. 1910 సంవత్సరారంభంలో రంగూన్ పట్టణానికిని, ఆ తరువాత నాగపురముకును బదిలీ అయిన సందర్భంలో ఆయన పరిశోధనలకు కొంత అంతరాయం వచ్చినా, 1911 నవంబరు నెలలో తిరిగి కలకత్తాకు బదిలీ చేయించుకొని ఆయన తన పరిశోధనలను సాగించినాడు. 1917 జూలై నెలలో కలకత్తా విశ్వవిద్యాలయ శాస్త్ర కళాశాలలో పదార్థ విజ్ఞానాచార్య పదవిని స్వీకరించుటకు పూర్వం ఇండియన్ ఎసోసియేషన్ పరిశోధనాగారాలలో వేంకట రామన్ చేసిన పరిశోధనలలో ముఖ్యమైనది శబ్ద శాస్త్రంలోనివే. కమానుతో రాసి నాదాన్ని పుట్టించే సంగీత పరికరాలనుగూర్చి రామన్ గావించిన పరిశోధనలు శబ్ద శాస్త్ర పరిశోధనలలో చాలా ముఖ్యమైనవి. ఆ పరిశోధనలవలననే రామన్ ప్రతిభ చాలా ప్రస్ఫుటమై సర్ ఆశుతోష్ ప్రశంసకు పాత్రుడైనాడు. "Wolf Note" ఆదిగాగల విషయాలపై శబ్దశాస్త్రంలో ఆయన చేసిన పరిశోధనలు ఇంకా చాలా ఉన్నవి.

ఎట్లయినా రామన్‌కు ప్రపంచ ప్రఖ్యాతి నార్జించి పెట్టినవి శబ్దశాస్త్ర పరిశోధనలుగావు: అవి తేజశ్శాస్త్ర పరిశోధనలు.

రామన్ తేజశ్శాస్త్ర పరిశోధనలుకూడా 1906లో ఆయన ఎం. ఏ. తరగతిలో చదువు చుండగనే ఆరంభమైనవి. ఆతరువాత ఆ శాస్త్రంలో అయన అనేక పరిశోధనలు చేసి నారు. కాని సాగరనైల్యానికి కారణం వివ రిస్తూ 1921 లో ఆయన చేసిన పరిశోధనలే వీటిలో ప్రాముఖ్యం వహిస్తవి.

1921 వ సంవత్సరంలో బ్రిటిష్ సామ్రా జ్యాంతర విశ్వవిద్యాలయం మహాసభకై వేంకట రామన్ ఓడమీద ఆంగ్లదేశం వెళ్ళాడు. ఆ సమయంలో తళతళ మెరుస్తూ, మధ్యధరా సముద్రంలో చాలా గాఢంగా కానవచ్చిన సాగరనైల్యం ఆయన నెక్కువగా ఆకర్షిం చింది. వెంటనే దానికి కారణం తెలిసికోవాలని కుతూహలంకూడా ఆయనకు కలిగింది. తత్ఫలి తంగా ఆంగ్లదేశం చేరుకొనిన వెంటనే అందునుగూర్చి పరిశోధనలు చేసి, అది కాంతి పరిక్షేపణ ఫలితమని నిర్ధేశించినాడు.

౨

జల ప్రవాహానికి చిన్న ఆటంకం ఏదైనా కల్పిస్తే, ఆ ప్రవాహంలోని నీరు పలు దిక్కు లకు చిమ్ముతుంది. అధిక పీడనంతో కుళాయి గొట్టనుండి వచ్చే నీటికి చేతిని అడ్డు పెడితే ఆ నీరు నలుపైపులకు చిందుతుంది. నీటికంటె అనేకరెట్లు అధిక వేగంతో తేజస్సు ప్రయాణం చేస్తున్నది. ఆ సమయంలో దాని తరంగ దైర్ఘ్య పరిమాణంకంటె అధిక పరి మాణం గల ప్రకాశ నిరోధక పదార్థం ఏదైనా దాని కడ్డు తగిలితే, వెంటనే ఆ కాంతికిరణం వెనుదిరుగుతుంది. దానినే పరివర్తన మం టారు. కాంతి కిరణాల ప్రయాణ మార్గానికి అడ్డుతగిలే పదార్థం హెచ్చు ప్రమాణంగల ప్రకాశ నిరోధక పదార్థంగాక పారదర్శక పదా ర్థమే అయితే (Transparent) ఆ యానం గుండా తేజస్సు—కొన్ని మార్పులను పొంది - ప్రవహిస్తూనే ఉంటుంది. ఆ సమయమందే వక్రీభవనము ఆదిగాగల తేజస్సంఘటనలు సంభవిస్తవి. ఇక ఈ నిరోధక పదార్థం కాంతికిరణ పరిమాణంకంటె అధిక పరిమా ణం గాక దాని తరహా పరిమాణాన్నే కలిగి యుంటే ఆ కాంతికిరణం పూర్తిగా పరివర్త నాన్నిగాని, వక్రీభవనాన్నిగాని పొందక పలు దిక్కులకు బంపుతుంది. ఈ సంఘటనకే 'కాంతి పరిక్షేపణ' (Light Scattering) అని పేరు. తేలియాడుచున్న అత్యల్ప పరిమాణం గల ద్రవ్యకణాలుగల యానకంగుండా కాంతి ప్రసరించినపుడు ఇట్టి సంఘటన ఏర్పడుతుంది. తేలియాడుచున్న ద్రవ్యకణాలుగల యాన కముల కుదాహరణంగా సిగరెట్టు పొగతో కూడిన గాలిని, బురదనీటిని తీసికోవచ్చు. యానకానికి అన్యములై యానకంలో తేలి యాడుచున్న ద్రవ్యకణాలు ఆ యానకాల గుండా ప్రవహించే కాంతికిరణాలు చిందగొట్టు నని ఆదిలో టెండాల్ అనే విజ్ఞాని కను గొన్నాడు.

టెండాల్ తర్వాత కాంతి పరిక్షేపమును గూర్చి రాలే విజ్ఞాని పరిశోధనలుచేసి, "కాంతి కిరణాలను చిందగొట్టుటకు యానకానికి

అన్యములై, యానకంలో తేలియాడుచున్న కణాలే అక్కరలేదు; ఆ యానకం ఏ అణువులతో కూడియుందో ఆ యణువులే అందుకు సమర్థములై యున్నవని అన్వేషించినాడు.

తెల్లని కాంతి పలు వర్ణముల మిశ్రమని మనకు తెలిసిన విషయమే. దానిలో నీల లోహితము, గాఢనీలము, నీలము, ఆకుపచ్చ, పసుపు పచ్చ, నారింజ వర్ణము, శోణవర్ణము ఆదిగాగల అనేక వర్ణాల కాంతులున్నవి. ఈ కాంతుల తరంగ దైర్ఘ్యములు నీలలోహితము నుండి శోణవర్ణమునకు పోయినకొలది హెచ్చును. ఇక తెల్లనికాంతి, అది ప్రసరించుచున్న యానకముచే పరిక్షిప్తమైనపుడు. దానిలోని వివిధ వర్ణములు ఒకే మొత్తములో పరిక్షేపణమును పొందవు. కాంతియొక్క అల పొడవు తగ్గినకొలది ఆ వర్ణములో పరిక్షిప్త మగు భాగము అధికముగ నుండును. దీనిని బట్టి తెల్లనికాంతి పరిక్షేపణను పొందినపుడు దీనిలోని తక్కువ అల పొడవుగల నీలివర్ణం హెచ్చు మొత్తంలోను, ఎక్కువ అలపొడవు గలశోణవర్ణం తక్కువ మొత్తంలోను పరిక్షేపణను చెందుతవి. కాబట్టి తెల్లని సూర్యకాంతి సముద్ర జలములోనికి చొరచుకొని ప్రవేశించినంతనే, ఆ నీటి యణువు లాకాంతిని గ్రహించి, దానిని పలువైపులకు చిందగొట్టుతవి. ఈ సంఘటనలో అల్పతర తరంగ దైర్ఘ్యాలుగల గాఢ నీల నీలివర్ణములే హెచ్చుగా సంక్షిప్తమగుటచే సముద్ర జలములోనుండి మన కండ్లను చేరు కాంతిలో వాని తీక్ష్ణతయే సాపేక్షముగా హెచ్చుగ నుండి, సముద్రము నీలిగా గోచరిస్తుచున్నది. అంతేగాక పరిక్షిప్త కాంతి తీక్ష్ణత కేవలం తేజస్తరణదైర్ఘ్యం పైననేగాక పరిక్షేపక పదార్థ మొత్తంపైకూడ ఆధారపడియుండి, పరిక్షేప పదార్థ మందము అధికమైనకొలది పరిక్షిప్త కాంతి తీక్ష్ణతకూడ హెచ్చుచుండుటచే లోతులేని ప్రదేశములందు కంటె మిక్కిలి లోతుగనున్న తావులందు సముద్రం గాఢనీలివర్ణంతో గోచరిస్తూంటుంది. సూర్యకాంతి తీక్ష్ణత తక్కువగ నున్న ప్రాతస్సాయం సమయములందుకంటె సూర్యకాంతి తీక్ష్ణత మిక్కిలి హెచ్చుగనున్న అపరాహ్ణమునందే సాగరనైల్యము గాఢముగ నుండుట గమనించవలసిన విషయము.

3

1921 లో సాగర నైల్యానికి తగు వివరణ మొసంగినంతనే ప్రపంచ వైజ్ఞానికులందరు వేంకట రామన్‌ను పలురీతుల అభినందించినారు. ఆతరువాత కాంతి పరిక్షేపణలో ఆయన చేసిన పరిశోధనలు చాలా ముఖ్యమైనవి. ఆ పరిశోధనల ఫలితంగా 1928 లో ఒక మహత్తరమైన సిద్ధాంతాన్ని ఆయన కనుగొన్నాడు. అదియే "రామన్ ఇఫెక్టు"

రాలే పరిక్షేపణలో పరిక్షిప్త కాంతికిని, పతన కాంతికిని ఒక్క తీక్ష్ణతలో వినా మరి యెందును వ్యత్యాస ముండదని పరిశీలించితిమి. కాని కొన్ని శుద్ధమైన ద్రవపదార్థముల గుండా ఒకే ఒక వర్ణముగల కాంతిని ప్రసరింపజేసి, ఆ ద్రవములలోని అణువులచే పరిక్షిప్తమైన కాంతిని పరిశీలించగా, దానిలో మరి కొన్ని వర్ణాల కాంతులుకూడా గోచరమైనవి. 1928 లో వేంకట రామన్ కనుగొనిన మహా సత్య మిదియే. ఇదియే "రామన్ ఇఫెక్టు"

ఇట్లు పరిక్షిప్త కాంతివర్ణము మార్పు నొందుటకు హేతు వేమిటి? పరిక్షేపణ చెందే కాంతి ఒక యానకముగుండా ప్రసరించినపుడు ఆ యానకములోని అణువులనుండి ఆ తేజస్సు కొంత శక్తిని గ్రహించవచ్చు; లేదా తనలోని కొంత శక్తిని గోల్పోవచ్చు. ఇట్లు శక్తిని గోల్పోయినచో ఆ కాంతి తరంగ దైర్ఘ్యము హెచ్చును; అట్లుగాక అది శక్తిని పొందినచో దాని తరంగ దైర్ఘ్యము తగ్గును. ఇట్లు పరిక్షిప్తకాంతి తరంగ దైర్ఘ్యంలో వచ్చే మార్పు ఆ పరిక్షేపక యానకంపై ఆధారపడి యుంటుంది.

ఆధునిక విజ్ఞానాభివృద్ధికి X కిరణాలు, రేడియో ధార్మికత్వం ఎంత ఎక్కువగా తోడ్పడ్డాయో రామన్ ఇఫెక్టు కూడా అంత ఎక్కువగానే తోడ్పడిందని వేరే చెప్పనక్కర లేదు. పదార్థం ఏ అవస్థలో నున్నాసరే. అది ప్రకాశ పారదర్శకమైయుంటే చాలు. దాని లోని అణువుల చరిత్రను సమగ్రంగా "రామన్ ఇఫెక్టు" నుపయోగించి తెలిసికోవచ్చు. పరి మాణాత్మకమైనవి. గుణాత్మకమైనవి. -రెండు రకముల పరిశోధనలలోను కూడా రసాయన శాస్త్రజ్ఞులకు చాల ఎక్కువగా "రామన్ ఇఫెక్టు" ఉపయోగపడుచున్నది. ఒక పదా ర్థంలో ఏఏ పరమాణువు లున్నవో, ఆ పర మాణువు లే రీతిగా బంధితమై అణువులుగా ఏర్పడినవో ఘనములలోనైతే యీ అణువులు ఏ రీతిగా కూర్చబడి, ఆయా స్ఫటికములుగా తయారైనవో అవలీలగా తెలిసికోవచ్చు.

"రామన్ ఇఫెక్టు"ను పరిశీలించడానికీ, దాని నుపయోగించి పరిశోధనలు చేయడానికీ అంత ఎక్కువ ఖరీదైన పరికరాలు ఏమీ అవసరంలేదు. ప్రతి పెద్ద ప్రయోగశాలలోను తప్పని సరిగా ఉండే వర్ణపటమాపకంతో దానిని పరిశీలించవచ్చు. కాని "రామన్ ఇఫెక్టు"ను పరిశీలించుట ఎంత తక్కువ ఖరీదైన పరి కరంతో సాధ్యమవుతుందో, దానివలన అంత ఎక్కువ ఉపయోగం ఉంది.

## ౪

1888 వ సంవత్సరం నవంబరు 7 వ తేదీని తిరుచిరాపల్లి (తిరుచునాపల్లి)లో చంద్ర శేఖర వేంకట రామన్ జన్మించినాడు. తన తండ్రి చంద్రశేఖరయ్యర్ విశాఖపట్టణము లోని హిందూ కళాశాలలో పదార్థవిజ్ఞాన గణితశాస్త్రాచార్యుడుగా నియామితుడగుటచే తన నాల్గవయేటనే వేంకట రామన్ విశాఖపట్ట ణముకు పోయి, 1903 వరకును అక్కడనే యుండి, అక్కడి పాఠశాలలలోనే పఠించి, మెట్రిక్యులేషన్, ఇంటర్ మీడియెట్ పరీక్ష లలో ప్రతిభతో కృతార్థుడైనాడు. ఆ తరవాత ఆయన 1903 సంవత్సరం జనవరి నెలలో చెన్నపట్నగరములో రాజధాని కళాలలో బి. ఏ. తరగతియందు చేరి 1904 లో బి. ఏ. పరీక్ష లోను, 1907 జనవరిలో ఎమ్. ఏ. పరీక్ష లోను ఉన్నతశ్రేణిలో ఆరితేరినాడు. రామన్ జీవితంలో కొంతకాలం పరప్రభుత్వోద్యో గంలో వ్యర్థమైనమాట నిక్కువమే. మహేంద్రలాల్ సర్కార్ స్థాపించిన "ఇండి యన్ ఎసోసియేషన్"లో శాస్త్రపరిశోధనలు చేసికొనుటకై వేంకట రామన్ ప్రవేశించుట, ఆతని ప్రతిభను గుర్తించి కలకత్తా విశ్వవిద్యా లయ శాస్త్రకళాశాలలో పదార్థ విజ్ఞానాచార్య

డుగా నాతనిని సర్ ఆశుతోష్ నియమించుట రామన్ జీవితంలో మహత్తరఘట్టాలు. 1933 నుండి బెంగుళూరునందలి ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ డైరెక్టరుగను, ఆ తరువాత తాను పదార్థవిజ్ఞాన శాఖాధ్యక్షుడుగను పనిచేసి, ఇటీవలనే అందుండి ఆయన విరమించినాడు.

బెంగుళూరులోని "ఇండియన్ ఇన్‌స్టిట్యూట్" పరిశోధనాగారములలో స్ఫటిక నిర్మాణంపై రామన్ గావించిన పరిశోధనలు చాలా ముఖ్యమైనవి. ఆ విషయంలో గత పది, పది హేనేళ్లగా ఆయన గావించుచున్న కృషి ఫలితంగా ఏతద్విషయమైన పూర్వ భావాలన్నీ పూర్తిగాత్రోసి రాజనబడినవి. అయితే రామన్ సిద్ధాంతం నిర్దుష్టమైనదని ప్రపంచ వైజ్ఞానికు లందరు ముక్తకంఠంతో అంగీకరించుటలేదు. (ఇతర దేశాలలో కొంతమంది శాస్త్రజ్ఞులకు, రామన్‌కు) స్ఫటిక నిర్మాణమును గూర్చి రామన్ ప్రతిపాదించిన సిద్ధాంత విషయాలలో కొన్ని అభిప్రాయ భేదాలున్నవి. అవికూడా తీరితేనేగాని రామన్ సిద్ధాంత ప్రాముఖ్యం రూఢం కాదు.

ప్రస్తుతం బెంగుళూరులోనే "రామన్ రిసెర్చి ఇన్‌స్టిట్యూట్" అనే పేరుతో ఒక పరిశోధనాగారాన్ని నెలకొల్పుకొని, స్ఫటిక నిర్మాణాన్ని గూర్చిన సిద్ధాంతంపై వేంకట రామన్ ముమ్మరంగా పరిశోధనలు చేస్తున్నాడు.

సాగరనైల్యానికి కారణాన్ని వివరించి నంతనే 1924 లో తమ సంఘసభ్యునిగ నెన్నుకొని లండన్ రాయల్ సంఘంవారు రామన్‌ను గౌరవించేరు. "రామన్ ఇఫెక్టు" అన్వేషణానంతరము 1930 లో రామన్‌కు నోబెల్ బహుమానము ఒసంగబడినది. శాస్త్ర ప్రపంచంలో విజ్ఞానకర్త కాంక్షించే బహుమానాలలో ఇది అత్యున్నతమైనది. ప్రాచ్య దేశములలో విజానములో ఈ బహుమానాన్ని కైవసం చేసికొన్న మేధావులలో మొట్ట మొదటివాడు వేంకట రామనే! అమెరికా సంయుక్త రాష్ట్రములు, యునైటెడ్ కింగ్‌డం, ఫ్రాన్సు, చైనా, జర్మనీ....మున్నగు పెక్కు దేశాలవారు వేంకట రామన్‌ని అనేక విధముల సన్మానించిరి। స్వతంత్ర భారత ప్రభుత్వ మాయనను ప్రథమ జాతీయ పరిశోధనాచార్యునిగా నియమించి, సత్కరించినది!।

నవభారత వైజ్ఞానికులలో వేంకట రామన్ కొక ప్రత్యేకస్థాన మున్నది: విజ్ఞాన క్షేత్రమున కృషిచేసి సుఫలములను పుష్కలముగా బండించుటలోనేమి, స్వయపరిశోధనలచే శాస్త్రప్రపంచములో భారతదేశ ప్రతిష్ఠ నినుమడింప జేయుటలోనేమి రామన్‌కు ఈడైనవారు అధునాతన భారత విజ్ఞానులలో నింతవరకు మరియొకరు లేరు. ఈ నెలలో ఆ మహావిజ్ఞాని తన అరువది రెండవ జన్మ దినోత్సవాన్ని జరుపుకొంటున్నాడు. ఆ శుభ సమయంలో ఆయన కివియే మన శుభాకాంక్షలు!!

# గాంధీయుగంలో సంస్కృతీ వికాసం

శ్రీ బుర్రా వెంకట సుబ్రహ్మణ్యం

గాంధీజీ చనిపోయి సుమారు మూడు సంవత్సరాలు కావస్తోంది. రేపు గాంధీజీ జన్మదినం. ఆనాడు గాంధీజీని అతిఘోరంగా చంపిన దుర్మార్గుడుని ఉరితీసి అప్పుడే ఏడాది పైగా అవుతోంది. గాంధీజీలేని కొరత ఎప్పటికి మరవగలమో ఇప్పటికింకా స్ఫురించడంలేదు. నవకాలీలోనూ, తూర్పు బెంగాలులోనూ, పాకిస్తానులోనూ, ఇండియాలోనూ 1947 లో చెలరేగిన మంటలు ఇప్పటికింకా పూర్తిగా చల్లారలేదు. ఒంటరిగా, ఓపికగా, మితిలేని దుఃఖంతో, మితిలేని ధైర్యంతో, ఆనాడు గాంధీజీ ప్రతి అడుగూతొక్కి పావనం చేసిన తూర్పుబెంగాలు పల్లెలుకాని, బీహారు పల్లెలుకాని, పాకిస్తానుకాని, ఇండియాకాని, ఢిల్లీ కాని, కరాచీకాని, ఇంకా గాంధీజీపెట్టి పోయిన పుణ్యానికి సంపూర్ణమైన అర్హత సంపాదించలేదు. వినవలసినచోటా వినకూడని చోటా, అనుకూలంఅయినప్పుడూ అనుకూలం కానప్పుడూ కూడా గాంధీజీ పేరు వినియోగింపబడుతూనే ఉంది, వింటూనే ఉన్నాం. గాంధీజీమాత్రం లేడు. గాంధీజీ తన ప్రాణం పోసి పెంచిన ఆశయాలూ జీవశక్తులూ కూడా ఎంతవరకు సజీవంగా ఉన్నాయన్న ప్రశ్నకి— అనేక సమాధానాలు :

గాంధీజీ అప్పుడే పుట్టి, పెరిగి, పోయాడు. అంటే, గాంధీయుగం ప్రారంభించినట్టా, ప్రారంభించనట్టా? అంతరించినట్టా, అంతరించనట్టా? అసలు గాంధీయుగం అంటే ఏమిటి?—ఈ ప్రశ్నలకి ముందు సమాధానం చెప్పుకోవాలి.

ఏసుక్రీస్తు కాలంలో క్రైస్తవమతం లేదు. క్రైస్తవ యుగం క్రీస్తు తర్వాతనే. ఆనటోల్ ఫ్రాన్సు వ్రాసిన కథలో, ఏసుక్రీస్తు చనిపోయిన కొన్ని దశాబ్దాల తర్వాత, "ఏసుక్రీస్తు అంటే ఎవరు? నాకు జ్ఞాపకంకూ లేదే!" అంటాడు ఏసుక్రీస్తుని తీర్పుచెప్పి దండించిన పైలేట్ః అనేక తీర్పులు చెప్పేడు, అనేక శిక్షలు చెప్పేడు, పైలేట్. ప్రత్యేకంగా ఈముద్దాయి ఎవరో అతని మనసుకి తట్టలేదు.

ఇదేవిధంగా గాంధీయుగం కూడా ఎప్పుడో ముందుముందు రావలసినదేనా? లేక, ఇప్పుడు జరుగుతూనే ఉందా?

అంతర్జాతీయంగా, భవిష్యత్తు యొక్క మతంగా, గాంధీయుగం ఇంకా ఆరంభం కాలేదు. కొరియాలోనూ యూరోపులోనూ జరుగుతున్న వ్యవహారాలే దీనికి తార్కాణం.

దేశదేశాలయొక్క పత్రికలవల్లా రేడియోల వల్లా గాంధీజీ పేరూ విషయమూ లోకాని కంతకీ తెలిసిన మాట నిజమే. కాని అదంతా గాంధీజీ పేరుకి మాత్రమే ప్రచారం. గాంధీజీ ఆశయాలకీ గాంధీజీ దృక్పథానికీ లోకం అలవాటు పడలేదు, తయారుగాలేదు.

ఈ సందర్భంలో, మనదేశంయొక్క పరిస్థితి మాత్రం ఏమిటి?

మనదేశంలో గాంధీయుగం జలియన్ వాలాతో ప్రారంభం అయింది. ముఖ్యంగా రాజకీయమార్గాన్నే అనుసరించింది. ఆర్థిక విధానాన్నీ సంఘాన్నీ మతాన్నీ అనేక విధాలుగా అయుముకుంది. సాహిత్యాన్నీ లలితకళలనీ మాత్రం అంటగా అంటలేదు. కారణం గాంధీజీ యొక్క స్వభావసిద్ధమైన తత్వమే. గాంధీజీకి కవి రవీంద్రునికీ కాని, గాంధీజీకీ జవహర్ లాల్‌కీ కాని, గాంధీజీకీ చర్చిల్‌కీ కాని, ఈ తత్వం విషయంలో అఖండమైన భేదం కనిపిస్తుంది. అకస్మాత్తుగా లండన్‌లో కలుసుకునే వరకూ చార్లీచాప్లిన్ ఎవరో తెలియని గాంధీజీకీ, ఏ సందుల గొందులలోనైనా ఏ వికృత రూపంగానైనా బయటపడ్డ కళని కనిపెట్టి కాపాడే కళాపోషకులకీ చాలా వ్యత్యాసం ఉంది. అద్భుత రచనలు రచించిన టాల్‌స్టాయిని అటువంటి గ్రంథకర్తగా గాంధీజీ ఎరిగుండలేదు. అంత్యదశలో మతమనీ వేదాంతమనీ అహింసనీ ప్రాకులాడిన టాల్‌స్టాయిని మాత్రమే గాంధీజీ బోధ పరచుకున్నాడు. ఇట్టి గాంధీజీ మన సంస్కృతీ వికాసానికి ఏవిధంగా తోడ్పడ్డాడని అడిగితే, నిజానికి, మన సాహిత్యాలలోకాని, మన కళలలోకాని, గాంధీజీయొక్క సహాయాన్నీసాను భూతినీ నిరూపించేఛాయలువెంటనే కనపడవని ఒప్పుకోక తప్పదు. అంతమాత్రాన్ని గాంధీజీ దేశంయొక్క సంస్కృతికి తోడ్పడలేదనడానికి కూడా వీలులేదు. సాహిత్యంతోకాని సంగీతంతోకాని మరి ఏ ఇతర కళతో కాని సంబంధం ఉన్న వ్యక్తి ఆ ఒక్క కళలోనే ప్రవీణుడు కాగలడు. ఆ ఒక్కకళకే తన వ్యక్తిగతమైన ఛాయయూ క్రొత్త సౌందర్యాలూ అందివ్వగలడు. కళాజ్ఞానం అంతగాలేని గాంధీజీ, కళలన్నిటికీ అతీతుడైన గాంధీజీ, సాహిత్యాలన్నిటికీ కళలన్నిటికీ ఒక నూతనత్వం తేగలిగేడని చెప్పవలసి ఉంటుంది. గాంధీజీ అమితమైన రాజకీయవేత్తా కాదు, ఆర్థికశాస్త్ర పండితుడూ కాదు, మతోద్ధారకుడూ కాదు, సంఘసంస్కారీ కాదు, అన్నిటినీ మించిన కర్మయోగి. అన్నిటికీ తెగించిన కార్యశూరి. దక్షిణాఫ్రికాలో తన ఆత్మగౌరవానికి దెబ్బ తిన్న గాంధీజీ, హిందూదేశం వచ్చి, ఆంగ్లేయ ప్రభుత్వాన్నే కాకుండా, హిందూ మతాన్నీ హిందూ సంఘాన్నీ, ఆర్థిక విధానాన్నీ తారుమారు చేసిపారేసేడు. హిందూమతం అంటే సిగ్గుపడేవారూ హిందూమతం అంటే గర్వపడేవారూ కూడా గాంధీజీ సిద్ధాంతాలు విని తల్లడిల్లిపోయారు. ఇన్నాళ్ళూ సిగ్గుపడ్డవారు గర్వపడడం ప్రారంభించారు. ఇన్నాళ్ళూ గర్వపడ్డవారు సిగ్గుపడడం ప్రారంభించారు. సంఘం తల్లక్రిందులయింది. వేషా భాషామారడంప్రారంభించాయి. దొరలపద్ధతులూ దర్జాలూ దీనత్వాలూ పోయి, దేశమార్గాలూ సహజత్వమూ ఆత్మగౌరవమూ ముఖ్యం అయాయి. ఈమార్పు కళాలోకానికి కూడా తగిలింది.

1907లో స్వదేశీ ఉద్యమం వచ్చినప్పుడూ, 1913 లో రవీంద్రనాథ్ టాగూరుకు నోబెల్ ప్రైజ్ ఇవ్వబడినప్పుడూ, అరవిందఘోష్ వల్లా, బాలగంగాధరతిలక్ వల్లా, ఏనీబిసెంట్ వల్లా ఈమార్పు వచ్చే సూచనలు గాంధీజీకి పూర్వం లేకపోలేదు. కాని ఆరోజులలో సామాన్య ప్రజకి ఈజ్ఞానం అందివ్వ ప్రయత్నించిన వ్యక్తి లేడు. ఆర్థికంగా కాని సంస్కార రూపంగాకానిపైపై అంతస్థుల ప్రజకే ఈజ్ఞానం చూపించగలిగేరుఆనాటి నాయకులు. గాంధీజీ హయాములో అంతస్థులు కూలడం ప్రారంభించాయి. ప్రజ ఏకమయారు.

గాంధీజీతో వచ్చిన మార్పు దేశభాషలకి లాభించింది. దేశ కళలకి కూడా లాభించింది. దేశభాషలలో సాహిత్యాలు వాటివాటి వ్యక్తిత్వాలకోసం వెతకడం ప్రారంభించాయి. ప్రాకులాడడం ప్రారంభించాయి. కర్ణాట సంగీతం, భరతనాట్యం, బెంగాలు పద్ధతి చిత్రకళా అభివృద్ధిలోకి వచ్చాయి. ఇంగ్లీషులో అతిరమ్యంగా మాట్లాడగల రామలింగారెడ్డి కంటె తెలుగులో అతిరమ్యంగా మాట్లాడగల దుగ్గిరాల గోపాలకృష్ణయ్య ప్రజాహృదయాన్ని ఎక్కువపూర్తిగాఆకర్షించాడు. ఇంగ్లీషులోమాట్లాడే శ్రీనివాసశాస్త్రి కంటె అరవంలో మాట్లాడే సత్యమూర్తి ఉన్నతస్థానం సంపాదించాడు. సరోజినీదేవీ హరీంద్రనాథూ వెనక్కిపడ్డారు. భారతికవీ దేవులపల్లి కృష్ణశాస్త్రీ ముందుకొచ్చారు. మన దామెర్ల రామారావుకు అలవడిన బొంబాయి పద్ధతి చిత్రకళ తగ్గి, నందలాల్ బోసు మొదలైన పండితుల మార్గం ఉచ్చదశకి వచ్చింది. దక్షిణాన్ని ఎప్పుడూ గౌరవింపబడుతున్న సంగీత నాట్య కళలు పెద్దా చిన్నా అని లేకుండా ఒక్కసారిగా ప్రతి ఇంటా ప్రతిష్ఠింపబడుతూ వచ్చాయి. ఈ మార్పుకి కేవలం గాంధీజీ ఒక్కడే కారకుడిని చెప్పడానికి లేదు. కాని గాంధీజీయొక్క మంత్రబలమే లేనినాడు ఈ మార్పు ఇంత సులభంగా ఇంత సున్నితంగా ఇంత పరిశుభ్రంగా దేశానికంతకీ కలిగి ఉండదనిచెప్పవలసి ఉంది. కథలూ కవిత్వాలూ, సంగీతాలూ శిల్పాలూ, నాటకాలూ నాట్యాలూ ఏమిటో తెలియని గాంధీజీ ఈమార్పుకి, ఈ నూతనసంస్కృతికి ఎలాసహాయపడగలిగేడని అడిగేవారు, ఎంతమంది చదువురాని తల్లులు ఎంతమంది చదువుకున్న పిల్లల్ని సన్మార్గంలో పెంచగలుగుతున్నారో జ్ఞాపకం ఉంచుకోవలసి ఉంటుంది.

సంస్కృతికి ఆత్మగౌరవం ప్రధానం. సంస్కృతి వేషభేషజం కాదు. సంస్కృతి ఒక మనోమార్గం. ఈ మార్గం చూపించగల వ్యక్తి సంస్కృతిని పోషించగలవాడవుతాడు. దేశంలో రోడ్లువేసినవాడు దేశంయొక్క ఆర్థికపరిస్థితి బాగుపరచిన వాడయినట్టు. గాంధీజీ మన కిటువంటి మార్గం చూపించాడు. సంస్కృతిని పోషించాడు. సంఘంలో యావన్మందికీ వ్యక్తిత్వమూ ఆత్మగౌరవమూ సమకూర్చడానికి చూసిన గాంధీజీ, హరిజనసేవ మూలంగానూ, పల్లెలంటే అభిలాషవల్లనూ, మన సంస్కృతికి అపారమైన బలమూ ఆరోగ్యమూ చేకూర్చాడు.

సంఘానికీ మతానికీ సామాన్య ప్రజకీ ఈ విధంగా గాంధీజీ తెచ్చిపెట్టిన నూతన

సంస్కృతి అటుండనిచ్చి, ఏకళకైనా ప్రత్యేక సహాయంకాని ప్రత్యేక అభిమానం కాని గాంధీజీ చూపించాడా అని ఆలోచిస్తే, దేశసాహిత్యాలకి గాంధీజీ ప్రత్యేకంగా తోడ్పడ్డాడని నాకు తోస్తోంది. గాంధీజీ గుజరాతీ భాషలో వ్రాసిన గ్రంథాల గురించినేనుచెప్పడం లేదు. కన్నయలాల్ మున్షీ మొదలైనవారు గాంధీజీ గుజరాతీ భాషలో ఎంత అందంగా వ్యాసాలూ తన స్వీయ చరిత్రా వ్రాసేదో వర్ణించే ఉన్నారు. ఏభాషలో వ్రాసినా, మనిషి పదును భాషకి రాకతప్పదు. గాంధీజీ ఇంగ్లీషు భాషలో కూడామన అందరికంటే, జవహర్‌లాల్ కంటే, శ్రీనివాసశాస్త్రికంటే ఎక్కువ బాగా వ్రాయ గలిగే వాడని నమ్మేవాళ్ళల్లో నేనొకడిని. కాని, నేను చెప్పదలచిన విషయం అదికాదు. గాంధీజీ హిందీని జాతీయ భాషగా చేయటాని, అందరూ హిందీనేర్చు కోవాలనడంలో, దేశ భాషల కన్నిటికీ హిందీ భాషతో సంబంధం కుదిర్చి, హిందీభాష ద్వారా దేశభాష లన్నిటికీ సంబంధం కలిపి, ఎవరి సాహిత్యం మాత్రం వారికి కాకుండా, అన్ని భాషల సాహిత్యాలూ అందరికీ అందివ్వడానికి వీలు కలుగజేసేడు. ఈవిధంగా దేశం యావత్తు మీదా సాహిత్యా భివృద్ధికి గాంధీజీ చాలా కలిసివచ్చాడని మనం అంగీకరించక తప్పదు.

మరొక్క మాటచెప్పాలి. గాంధీజీయొక్క ఆదర్శాలు అరవభాషలో భారతికవిని ఎలా కది పేయో నేను చెప్పలేను కాని, తెలుగుబాషలో, తెలుగు సాహిత్యంలో, విషయ రూపంగానూ, భావరూపంగానూ ఈ ఆదర్శాలు ఏ కవినీ, ఏ కథకుడినీ కదిపిన ఉదాహరణ నాకు తోచ డంలేదు. మునిమాణిక్యం నరసింహారావు కాంతం కాని, గుడిపాటి వెంకటచలం విపరీత వనితలు కాని దేవులపల్లి కృష్ణశాస్త్రి ప్రేయసులు కాని, శ్రీరంగం శ్రీనివాసరావు గేయాలు కాని గాంధీజీనీ, గాంధీజీ తత్వాన్నీ స్మరణకి తెచ్చే వస్తువులుకావు. ఇది గాంధీజీ లోటో లేక తెలుగు సాహిత్యంలోటో నేనుచెప్పలేను. చెప్పవలసి వస్తే, ఇరు ప్రక్కలా లోటు లేదనీ, గాంధీజీ యొక్క నిషేధననిబంధనలు సాహిత్య రూపానికి అను గుణ్యం కావనీ ఒప్పుకోవలసి వస్తుందేమో!

ఈవ్యాసం కిన్నెర పత్రికా కార్యాలయంలో జరిగిన గాంధీ జయంతి సందర్భంలో చదువబడినది.



# "శా లి వా హ ను లు"

శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మ

[శాలివాహనుడు ఆంధ్రరాజు. ఆంధ్ర జాతిలో సాతవాహనులది ఒక కులము. సాతవాహనులను శాలివాహను లందురు. సాతుడు అనే యక్షుడు వాహనముగా గలవాడగుటచేత సాతవాహను డనుపేరు కలిగెనని కొందరు చెప్పుదురు. నిజమునకు చూడగా సాతవాహన పదమునకుగాని, శాలివాహన పదమునకు గాని వ్యుత్పత్త్యర్థము చెప్పుట కష్టము.

*　　　*　　　*

శాలివాహన వంశమువారే దక్షిణాపథములో మొట్టమొదటి రాజ్యమును స్థాపించిన ఆంధ్ర భూమీశులు; ఆంధ్రసంస్కృతికే కాక దక్షిణాపథ సంస్కృతికి పునాదులు వేసి పోషించిన వారు—వారు.

*　　　*　　　*

శాలివాహనుడు శకస్థాపకుడు. విదేశములనుండి వచ్చిన శకులు, పహ్లావులు, యవనులు ఆంధ్ర రాజ్యమును ఆక్రమించుకొని మతా చార వ్యవహారములను భ్రష్టము చేసినప్పుడు ఆంధ్రరాజు శాలివాహనుడు సైన్యములను ఆయత్తముచేసికొని వెళ్లి వారితో భయంకర యుద్ధము చేసి వారిని ఓడించి పారద్రోలి దేశమును నిష్కంటకము కావించెను; సంఘమునకును సంస్కృతికిని పట్టిన చీడ తొలగించి ఆంధ్ర సంస్కృతికి మరల చిన్నెలు వన్నెలు దిద్దెను. ఆంధ్రసంఘమునకు ఒక క్రొత్తశక్తిని, ఒక క్రొత్త తేజమును ఇచ్చెను.

*　　　*　　　*

శాలివాహనుడు కుమ్మరియింట పుట్టెనని గాథ. కుమ్మరియింట ఉన్నందువల్ల అతనికి మట్టితో లొట్టిపిట్టలు, ఏనుగులు, గుఱ్ఱములు, బంట్లు చేయుట వచ్చెనట. అతడు ఇట్టి బొమ్మలతో ఒక సైన్యమును తయారు చేసెను, అది దశరా కొలువుకేమో. ఆప్రాంతమును విక్రమాదిత్యుడను దుష్టరాజు పాలించుచుండెనట. అతడు తన బంట్లను బంపి బలవంతముగ మితిమీరి పన్నుల వసూలుచేయించి, ధనము దోపించి ఎన్నో విధముల ప్రజలను బాధ పెట్టుచుండెనట. తన ఊరు ప్రతిష్ఠాన నగరములోనే ఇట్టి దుష్కార్యములు జరుగగా చూచినాడు శాలివాహనుడు. ఇదంతయు చూచి శాలివాహనుడు తోడి పిల్లవాండ్ర నందరిని చేర్చి వారికి తరిఫీ దిచ్చి అమరుసటి తడవ రాజభటులు ఆనగరమునకు వచ్చినప్పుడు ఏమరిపాటున వారిపై బడి పరిపరి విధముల వారి నవమానించి పారద్రోలెనట. ఈవృత్తాంత

కును చిలవలు పలవలుపెట్టి రాజభటులు తమ ప్రభువు విక్రమాదిత్యునికి నివేదించిరి. విక్రమాదిత్యుడు శాలివాహనుని తన కొలువుకూటమునకు రావలసినదని కబురంపెను? మరల తన భటులయెడల ఆవిధముగ ప్రవర్తించినచో రాజశిక్షకు పాత్రుడ వయ్యెదవని యాతనిని భయపెట్టెను. "రాజుల రోజులు పోయినవి. ప్రజలను ఆదరముతో పాలింపని ఏరాజ్యమును నిలవదు. దయతో ప్రేమతో ప్రజలను కనిపెట్టి పాలించిననే కాని నీరాజ్యము నీకు దక్కదు. బాలవాక్యము బ్రహ్మవాక్యమే. జాగ్రత" అని శాలివాహనుడు బింకముగ జవాబిచ్చెను. ఆజవాబు వినగానే విక్రమాదిత్యునికి కోపము రగులుకొనిపోయినది; ఈతని పొగ రడచవలెనని మహారాజు సైన్యములను దీసికొని శాలివాహనుడున్న నగరము ప్రతిష్ఠానముమీదికి దండెత్తి వెళ్ళెను. బలవంతుడయిన మహారాజు దండెత్తి వచ్చుచున్నాడని జంకలేదు, గొంకలేదు శాలివాహనుడు. ధైర్యము గలవారిదే లోకము; సాహసము గలవారికే విజయము అని అతనికి తెలియును. అత డిదివరలో తరిఫీదిచ్చిన బాలకు లందరిని చేర్చెను; మట్టిబొమ్మల సైన్యానికి ప్రాణము పోసెను. మట్టిబొమ్మలు గట్టి దళమయినవి. శాలివాహనుడే దళవాయి; బాలురు వీరులయినారు. విక్రమాదిత్య సైన్యమునకును శాలివాహన సైన్యమునకును భయంకర యుద్ధము జరిగినది. ఆ యుద్ధములో విక్రమాదిత్యుడు నేల కొరిగెను. అతని సైన్యము చెల్లాచెదరైనది. అధర్మము కాళ్లు విరిగినవి. విజయము శాలివాహనునిది. అతడు ప్రతిష్ఠానమున పట్టము కట్టుకొని ధర్మరాజ్యమును ప్రతిష్ఠించెను; బాలకులుగ నుండినవారే వీరమూర్తులై విజయపతాక నెగురవేసి ధర్మరక్షకులైరి.—శర్మ.]

"బాల దంపతులు" వారు. ఆవిడ అక్కయ్య;[1] ఆయన అన్నయ్య.[2] ఇవి వారికి చిన్ననాటినుంచి ఉన్న పుట్టుపేరులు కావు. మధ్య వచ్చిన పెట్టుపేరులు. కానయితే **ఆయన** ఒక కొందరికి అన్నయ్యా అవును; **ఆవిడ** కొందరికి అక్కయ్యా అవును. కాని **బాలకులకూ** బాలికలకూ వీరు వారు అనేభేదం **లేకుండా** అందరికీ ఆవిడ అక్కయ్యా, ఆయన **అన్నయ్యా** అయినది రేడియోకు వచ్చిన తరువాతనే. అప్పటినుంచీ అందరికీ ఆయన **రేడియో** అన్నయ్య; ఆవిడ రేడియో అక్కయ్య. **రేడియో**మాట బరుపై అందరూ ఆయన్ను అన్నయ్య అంటారు. అందరూ ఆవిడను అక్కయ్య అంటారు.

అక్కయ్యా, అన్నయ్యా రేడియోతో గారడీ చేశారు. వీధిలో గారడీ జరుగుతూ ఉంటే జనం మూగరూ, అట్లాగే రేడియోలో గారడీ జరుగుతూ ఉంటే పిల్లలందరూ మూగారు - చిన్నపిల్లలు, పెద్దపిల్లలు, పొట్టిపిల్లలు, పొడుగుపిల్లలు, బక్కపిల్లలు, బలుపు పిల్లలు - అందరూ మూగారు. ఒక్కొక్క పిల్లే ముందరికి వచ్చింది; ఒక్కొక్కపిల్లాడే ముందరికి వచ్చాడు. పిల్లలందరూ ఇనుము వంటివా ళ్ళయితే అన్నయ్యా అక్కయ్యా సూదంటురాళ్లవంటివా రైనారు. ఒక్కొక్కరినే ఆకర్షించాడు అన్నయ్య; ఒక్కొక్కరినే

1. శ్రీమతి న్యాయపతి కామేశ్వరమ్మగారు.
2. శ్రీయుత న్యాయపతి రాఘవరావుగారు.

ఆకర్షించింది అక్కయ్య. ఇప్పు డిద్దరు. తరువాత నలుగురు. ఆ పిదప పదహారుగురు - బాలకులసంఖ్య క్రమంగా పెరిగిపోయింది; బాలికలసంఖ్య వరుసగా హెచ్చిపోయింది. వచ్చిన పిల్లలను అక్కయ్య బుజ్జగించింది; వచ్చిన పిల్లలను అన్నయ్య లాలించాడు. వచ్చిన పిల్లలు రేడియో అన్నయ్యకేసి చూశారు; వాళ్ళమొహం ఉత్సాహంతో విప్పారింది; వచ్చిన పిల్లలు రేడియో అక్కయ్యకేసి చూశారు; వాళ్ల మనస్సు ఉల్లాసంతో పొంగిపోయింది. పిల్లలందరూ అన్నయ్యచుట్టూ మూగారు; పిల్లలందరూ అక్కయ్యచుట్టూ కూర్చున్నారు.

రేడియోలో పిల్లలమధ్య కూర్చుండి అన్నయ్య ఎన్నో గమ్మత్తులు చేస్తాడు; అక్కయ్య ఎన్నో వినోదాలు చెపుతుంది. అక్కయ్యా అన్నయ్యా పిల్లలలో పిల్లలయిపోతారు. పిల్లలమనస్సు అక్కయ్యకు తెలుసు. పిల్లలమనస్సు అన్నయ్యకు తెలుసు - వాళ్లూ పిల్లలేగా: - పొట్టిపిల్లలు. వాళ్ళ ఆటలు పిల్లల పాటలు; పిల్లల ఆటలు వాళ్లపాటలు. అన్నయ్య నాటకాలు రాస్తాడు; పిల్లలు నాటకాలాడుతారు; అక్కయ్య కథలు చెపుతుంది - పిట్టకథలు, జంతుకథలు, రాజకథలు, దేవకథలు. పిల్లలు ఆకథలకు కొన్నిటికి ముక్కు చెవులు పెట్టి నాటకాలు చేస్తారు. పిట్టవచ్చి మాటాడుతుంది; జంతువు వచ్చి మాటాడుతుంది. పిట్టలూ జంతువులూ మాటాడడమే కాదు; కూతలు కూస్తాయి; అరుపులు అరుస్తాయి. పిల్లలంతా ఈపిట్ట లెక్కడున్నాయా అని "స్టుడియో" అంతా కలయజూస్తారు; పిల్లలంతా ఈజంతువు లెక్కడా అని "స్టుడియో" అంతా కలయవెదకుతారు. పిట్టలు కనబడవు; కూత వినబడుతుంది; జంతువులు కనబడవు; అరుపు వినబడుతుంది. అన్నీ ఇట్లాగే. విమానం ఎగురుతుందా; అది కనబడదు. మోత వినబడుతుంది - అచ్చంగా విమానంమోతే. బలే గమ్మత్తుగా ఉంటుంది; అంతా అన్నయ్య గమ్మత్తే; అంతా అక్కయ్య తమాషే. ఈ తమాషాలో ఈ గమ్మత్తులో పిల్లలు నవ్వుతారు; పిల్లలు ఏడుస్తారు; పిల్లలు కూకలేస్తారు; పిల్లలు కేకలేస్తారు; పిల్లలు పాటలు పాడుతారు; వాళ్లు ప్రయాణీకు లవుతారు; యాత్రికు లవుతారు; పిల్లలు వర్తకులవుతారు, రాజు లవుతారు, రాణు లవుతారు, దేవత లవుతారు. అన్నయ్యచేసే గారడిలో- అక్కయ్యచేసే తమాషాలో ఆ పిల్లలు ఏమి కారు? ఏమి కావలిస్తే అది అవుతారు; అన్నయ్యకు అంత శక్తి ఉంది; అక్కయ్యకు అంత సత్తా ఉంది. అంతా విచిత్రమే. అంతా వినోదమే. రేడియో బాలబాలికల వినోదము—బాలానందం.

రేడియోలో బాలానందం జరుగుతూఉంచే ఊళ్ల వూళ్ల నగర నగరాల ప్రతీ రేడియో ప్రోగ్రామూ బాలానందంగా మారిపోతుంది. పిల్లలంతా రేడియోచుట్టూ మూగుతారు. ఆత్రంతో ఆ వినోదం పరికిస్తారు; ఆసక్తితో ఆ పాటలు వింటారు. ఆ వింతవింత కూతలు వింతవింత అరుపులు ఆలకిస్తారు. అక్కడ మళ్లీ ఒక బాలసంఘం బయలుదేరుతుంది. అక్కడ మళ్లీ ఈ నాటకాలే, ఈ వినోదాలే, ఈ వేడుకలే. ఇవన్నీ బాలానందం విడివిడి ప్రతులు.

ఆ బాలబాలికలు అక్కయ్యను బాలక్కయ్య గానే ఎరుగుదురు; ఆ బాలబాలికలు అన్నయ్యను బాలన్నయ్యగానే ఎరుగుదురు. బాలక్కయ్యంటే వాళ్ల కెంతో ప్రేమ; బాలన్నయ్యంటే వాళ్ల కెంతో చనవు. వాళ్లు వాళ్ల రేడియో కష్ట సుఖాలు అన్నయ్యకు వ్రాస్తారు; అక్కయ్యకు తెలియజేస్తారు - వాళ్ల సందేహాలు. అన్న య్యకు వ్రాస్తారు వాళ్ల ప్రశ్నలూ, వాళ్ల ప్రశంసలూను. అన్నయ్య అక్కయ్యల రేడియో ఉత్తరాలసంచి చాలా బరువైనది: అదొక పాములపుట్టే; అందులో ఆడేవి కొన్ని. పాడేవి కొన్ని: బుసకొట్టేవి కొన్ని: కరిచేవి కొన్ని: ఆ వుత్తరాలసంచి ఎయిర్ మెయిల్ బ్యాగ్‌కంటె పెద్దది. ఒక్కొక్క ఉత్తరమే బయటికి తీస్తుంది చెల్లాయిలు వ్రాసిన ఉత్తరాలలోనుంచి; ఒక్కొక్క ఉత్తరమే బయటికి తీస్తాడు, తమ్ముళ్లు వ్రాసిన ఉత్తరా లలోనుంచి—అక్కయ్యా అన్నయ్యాను. వాళ్లిద్దరూ ఆ బాలబాలికల సందేహాలు తీరు స్తారు; ఆ బాల బాలికల ప్రశ్నలకు జవాబు లిస్తారు; ఆ బాల బాలికల కోరికలు నెరవేరు స్తారు: ఆ బాల బాలికల ఆనందంలో పాలు గొంటారు; వారికి హితవు చెపుతారు; ఊర డిస్తారు; బుజ్జగిస్తారు. ఆ వుభయులదీ చిత్ర మైన అనుబంధం. అదొక పెద్ద బాల కుటుంబం. రేడియో అనుబంధంగల తెనుగు బాలలు అందరూ ఒకటి—వారు తెనుగు దేశంలో ఉన్నా సరే, మైసూరులో ఉన్నా సరే, పంజాబులో ఉన్నా సరే. ఈ బాలల ఐక్యతకు పని చేస్తున్న అక్కయ్యా, అన్నయ్యా ఎంత దొడ్డవారు! వారిది ఇదే పిలుపు—బాల లందరూ ఏకం కండి; ఒకటే ఒక జట్టుగా ఒక సంఘంగా ఏర్పడండి అని.

దీనితో మద్రాసులోని రేడియో బాలలకూ బాలికలకూ పైని దూరాన ఉండే బాల బాలికలకూ ఒండొరులకు ఒక చుట్ట రికము, ఆదరము, స్నేహము, ఆప్యాయత కలుగుతోంది. అదొక రాజ్యం—పిల్లల రాజ్యం. అదొక ప్రపంచం బాలప్రపంచం. అక్కయ్య బాలరాజ్య నిర్మాత. అన్నయ్య బాల నూతనప్రపంచ ప్రతిష్ఠాత. రేడియోను నిమిత్తమాత్రం చేసుకొని రేడియో అన్నయ్య పిల్లలందరితో విజ్ఞానదీపం వెలిగిస్తున్నాడు. రేడియో అక్కయ్య పిల్లల మనస్సులలో ప్రేమదీపం వెలిగిస్తోంది. ఆ బాలన్నయ్యా, బాలక్కయ్యా తలపెట్టింది ఒకమహోద్యమం. అది పిల్లల పెద్ద ఉద్యమమే—బాలఉద్యమం.

బాలానందంలో అప్పుడే కొన్ని పిల్లతల కాయలు పైకి వస్తున్నాయి. బాలానందం పిల్లలలో కొందరు నాయకులు, కొందరు అను చరులు. కొందరు గాయకులు, కొందరు పంత పాటకులు. కొందరు నాటకులు, కొందరు బూటకులు—పిల్లల కిపుడు ఒకవిధమైన సంఘజీవితం, పౌర జీవితం ఏర్పాటవుతోంది. వారి పాటలు వేరు. వారి ఆటలు వేరు. వారి అచ్చటలు వేరు. వారి ముచ్చటలు వేరు. అవన్నీ పిల్లలకు పూర్వమూ ఉండేవి. కాని ఆ పాటలు వేరు. ఆ యాటలు వేరు. ఈకాలా నికి తగినట్టు అన్నయ్య ఆ పాతపాటలకు, ఆ పాత వరుసలకు కొత్త తీర్పు లిస్తున్నాడు. కొత్త పాటలు కడుతున్నాడు. ఆ పాత పాటల సంచులలో కొత్తవిషయం నింపుతున్నాడు.

ఇప్పుడు పిల్లల గోష్ఠి వేరయింది. ఆటలే కాదు, పాటలేకాదు, వాళ్ల గ్రామఫోను రికార్డులూ వేరే. పక్షి కూతలకు, గొల్లభామ వినోదాలకు, బొమ్మల పెళ్లిళ్లకు, పాటలకు—అన్నిటికీ పిల్లల రికార్డులే—బలే మనోహర మయిన రికార్డులు. అదొక కొత్త సృష్టి. బాల ప్రపంచ సృష్టి. బాల పౌరజీవిత సృష్టి. ఇది రేడియో అన్నయ్య ప్రతిభ. రేడియో అక్కయ్య ఉపజ్ఞ. వారి ప్రజ్ఞాపాటవంచేత ఒక క్రొత్తసంఘం—బాలసంఘం తయారవు తోంది.

బాలానందంలో కొందరు వ్యక్తులు ప్రసిద్ధు లయినారు. వారు వస్తే, వారి పాత్రలు విని పిస్తే పిల్ల లందరికీ ఎంతో ఉత్సాహం. వారు ఎప్పుడు వస్తారా అని పిల్లలు ఆత్రంతో ఎదురు చూస్తూవుంటారు. పిల్లలకే కాదు. పెద్దలకూ ఆత్రమే. పెద్దల కీ బాలానందవినోదం విన ముచ్చటయిన వేడుక, బాలానందంలో మొద్దబ్బా యంటే ఎవరి కానందం కలుగదు? ఎన్నేళ్లు వచ్చినా అతడు బాల మొద్దబ్బాయే. బాలానందం వచ్చినతరువాత పొట్టిబావా చిట్టి మరదళ్లు ఇంటింటా వెలిశారు. ఎక్కడ చూసినా వాళ్ల పాటలే. వాళ్ల హాస్యాలే. చిత్ర మేమంటే ఎప్పుడూ చిట్టిమరదలే గెలుస్తుంది. మరదలిదె పైచెయ్యి. పొట్టి బావ ఎప్పుడూ చిట్టి మరదలికి లొక్కే. మరదలిని వెక్కి రింపబోయి పది పడుతూవుంటాడు. రేడియో పిల్లలకూ తాతయ్య ఉన్నాడు. రేడియో తాతయ్య వస్తున్నాడంటే పిల్లలకు మహా సరదా. తాతయ్య కథలు చెపుతాడు. కమామీషులు చెపుతాడు. వాళ్లకు నీతులు చెపుతాడు. వాళ్లతో వేళాకోళాలాడుతాడు. వినోదాలు చెపుతాడు—పిల్లలతో కలసి తాతయ్యా పిల్లతాతయ్యా అవుతున్నాడు. ఇక రేడియో అన్నయ్యా అక్కయ్యా సరే సరి. వాళ్లు "స్టుడియో"లో ఉన్నంతసేపు ఎప్పుడు అన్నయ్యగానూ ఎప్పుడు అక్కయ్యగానూ ఉంటారో చెప్పడం కష్టం. అన్ని అవతారాలూ వాళ్లవే. కామరూపులు వాళ్లు. వాళ్లు సిద్ధులేమో.

బాలానందంలో పిల్లలకు అనేకవిధాల తర్ఫీదు. మంచి శిక్షణ. ఆడడానికి పాడడానికి మాటాడడానికి అన్నయ్యా అక్కయ్యా పిల్లలకు భయం లేకుండా చేస్తున్నారు. ధైర్యం, ఉత్సాహం పోస్తున్నారు వారి గుండెల్లో. ఎంత గొంతు విప్పలేని చిన్న పాప సయినా—అన్నయ్య లాలిస్తాడు. ఎంత ముద్దయిన లాలస అది—దానితో కిచకిచలు పెట్టినట్లయి ఆ పాప గొంతు విడుతుంది. విడి ఆ పాప కూన రాగం తీస్తుంది. తడుముకొంటూ వొగరుస్తూ వొక జిలిబిలి పాట పాడుతుంది. పాట మరిచిపోతే ఊఁ ఆఁ అంటూ అన్నయ్య వెనుక హంగు. అప్పుడు బాలన్నయ్య పాపన్నయ్యే. మరో పాపాయి వస్తుంది. పద్యం సరిగా చదువలేదు. అక్కయ్య బుజ్జగిస్తుంది. పాపాయి కష్టమయే మాటలు మాటాడుతుంది, వెంటనే ఆ పిల్ల మనస్సులోనుంచి వొక సంతోషపు కెరటం పైకి చిమ్ముతుంది. ముద్దుముద్దుగా ఓ పద్యం చదువుతుంది. ఓ పాట పాడుతుంది. రేడియో అన్నయ్య నేర్పది. రేడియో అక్కయ్య వాకచక్య మది. ప్రతి పిల్లవాడూ అన్నయ్య దగ్గరకు వస్తే. ప్రతిపిల్లా అక్కయ్య దగ్గరకు వస్తే వాళ్ల మాటలన్నీ పాట లవు

తాయి, వాళ్ల చిందులన్నీ నృత్యా లవుతాయి. వాళ్ల చిలిపిచేష్టలన్నీ ముద్దులుగొలిపే వేడుక లవుతాయి. అ వొకగారడీ! అన్నయ్యా అక్కయ్యా చేసే గారడీ!

అన్నయ్యా అక్కయ్యా బాలబాలికలను చూసి మురిసిపోతారు. వాళ్ల కందరూ చెల్లెళ్లే. వాళ్ల కందరూ తమ్ముళ్లే. వాళ్ల యిల్లు బాల యిల్లే. ఆ యిల్లు కానయితే వాళ్లిల్లే. కాని పెత్తనం వాళ్లది కాదు. బాలలదే అంత పెత్తనమూను. బాలలందరూ అక్కడ గుమి గూడుతారు, ఆడుతారు, పాడుతారు. ఇల్లు చక్కబెట్టేవాళ్లు బాలలు. ఇంటి వ్యవహారం చక్కదిద్దేవాళ్లు బాలలు. ఆ బాల యింట్లో బాల న్నయ్యా బాలక్కయ్యా బాలల బాల అతిథులు, పెద్ద బాలలు అన్నయ్యా అక్కయ్యాను. వాళ్ల ఆలోచన లన్నీ బాలలను గురించే. వాళ్ల ప్రయత్నాలన్నీ బాలలకోసమే. బాలలకు శిక్షణ ఇవ్వడం, బాలలకు తరిఫీ దివ్వడం, బాలల కోసం పాటలు వ్రాయడం, బాలలకోసం. పోటీ నాటకాలు పెట్టడం, పాటలపోటీ, నృత్యాలు, గమ్మత్తు వేషాల పోటీ---అన్నీ ఇటువంటి ప్రయత్నాలే. వాళ్లు చూసినా బాల లనే. విన్నా బాలలనే. బాలమూర్తులు వారు.

అన్నయ్యా అక్కయ్యా బాలలకోసం "బాల" పత్రిక పెట్టారు, దేశంలో బాలల మొహాలలో చిరునవ్వు రేకెత్తింది. ఆనందం తాండవించింది. తెనుగు దేశంలో తెనుగు పిల్లలకోసం పెట్టిన మొదటి తెనుగు పత్రిక అదే. ప్రతి పిల్లవాడూ ప్రతి పిల్లా ఆ పత్రికను చూసి మురిసిపోయారు. అక్షరాలు తీయ నేర్చిన ప్రతి బాలా ఆ పత్రికలోని బొమ్మల కథలు చదివారు. ఆ బొమ్మల వినోదాలకు ఉప్పొంగారు. గొలుసుమాటలు వల్లించారు, కొత్త మాటలు కల్పించారు. అన్నీ తమాషా కథలే. అన్నీ చిత్రమైన గాథలే. ఊరూరా పాకింది "బాల". బాల నెత్తుక ముద్దాడారు బాలలు. "బాల" ఎప్పుడు వస్తుందా అని ఆత్రంతో ఎదురుచూశారు. "బాల" పత్రిక వచ్చిననాడు బాలలకు పండుగే. "బాల" పత్రిక బాలలలో చదవాలనే ఉత్సాహం రేపింది, అభి రుచిని కల్పించింది. ఈవిధమయిన ఆస్థ ఎక్కువయింది. పిల్లలకు బొమ్మలు గీయాలని కుతూహల్పం కలిగింది, కథలు వ్రాయాలని అభి లాషపొడమింది.బాలలను రచనకు ప్రోత్సహిం చింది, బాలల రచనలకు ఆదరము చూపింది. బాల రచయితలను తయారుచేసింది. బాల సంఘాల వృత్తాంతాలు ప్రకటించింది. చిక్కు మాటలు. చిక్కు లెక్కలు, చిక్కు బొమ్మలు విడదీయుమని బాలలను ప్రేరేపించింది. అంత టితో బాలల భావాలకు కదలిక వచ్చింది. బాలల ఆలోచనలు పరుగులు పెట్టాయి. "బాల" పత్రికతో అన్నయ్యా అక్కయ్యా బాల ప్రపంచంలో గొప్ప మార్పు తెచ్చారు. బాలలలో ఆశలు రేపారు. ఆదర్శాలు చూపారు. మంచీ చెడ్డా బాలలకు వివరించి చెప్పారు. వట్టి బొమ్మలను, గట్టి బొమ్మలుగా తీర్చి దిద్దు తున్నారు. "బాల" పత్రికలో బాల ప్రపంచం ప్రతిఫలించింది. బాల ప్రపంచాన్ని "బాల" పత్రిక ఆకట్టి ఉర్విళ్లూరజేసింది. "బాల" పత్రిక విలువా సేవా గ్రహించారు, దానిని స్థిరంగా నిలపడానికి, దాని కింకా అందాలు దిద్దడానికి అక్కయ్యా అన్నయ్యా "బాల"

పత్రికకోసం అచ్చాఫీసు పెట్టారు. అచ్చాఫీసును పత్రికను పోషించడమంటే మాటలా? డబ్బుతో పని. డబ్బు లేకపోతే పత్రికా నడవదు. డబ్బు లేకపోతే అచ్చాఫీసూ నడవదు. డబ్బెక్కడినుంచి వస్తుంది? అందులో మన దేశంలోను. చేస్తే మెప్పు లేదు. చెయ్యకపోతే రొప్పూ లేదు. చెయ్యలేదని అనేవారు లేరు. చేస్తే సంతోషించేవారూ లేరు. అవసరం వచ్చినపుడు ఏదయినా లాభం వుంటుందని తోస్తే ఓహో అంటారు. ఇటువంటి కొన్ని మాటలు ప్రతివారికీ పెదిమలను అంటుకొని ఉంటాయి. అవి కాసిన్ని అవసర మయినపుడు రాల్చేస్తారు. వారి సానుభూతి అంతకంటె లోతుకు పోదు. డబ్బు అసలే రాలదు. అయితేనేమి అన్నయ్యకు లక్ష్యం లేదు. అక్కయ్యకు లెక్కలేదు. వాళ్ల ఉత్సాహం వాళ్లది. దానికి అడ్డూ లేదు; ఆకా లేదు. బాల ఉద్యమంలో వాళ్లకు అచంచల విశ్వాసం; అది విజయం పొందకతీరదని వారి నమ్మిక. వాళ్ల ధైర్యమే వాళ్లకు శ్రీరామరక్ష.

అక్కయ్య అన్నయ్య పిల్లలఉత్సాహం చూశారు. పిల్లల శక్తి యుక్తులు చూశారు. పిల్లలలో గొప్ప శక్తు లున్నాయని గ్రహించారు అక్కయ్యా అన్నయ్యాను. వాటిని వికసింపజేయాలి. అట్లా చేస్తేనే రేపటి తెనుగు దేశం గొప్ప దవుతుంది. ఇదంతా ఆలోచించారు. బాలలకోసం దశరా ఉత్సవాలు ఏర్పాటు చేశారు—రెండు రోజులు. మొదటి యేడు గడిచింది! పిల్లలలో ఉత్సాహం ప్రబలింది. పిల్లల ఉత్సాహమంటే బాలక్కయ్యా బాలన్నయ్యా ఉత్సాహమే—వాళ్లూ బాలపిల్లలేగా, పెద్ద పిల్లలు. రెండో యేడు జరిగింది. మూడో యేడు జరిగింది. దశరా ఉత్సవాలు పిల్లలలోనే కాదు, పెద్దలలోనూ కొత్త ఉత్సాహం రేకెత్తించాయి. ఈయేడు నాలుగోయేడు—దశరా ఉత్సవాలు. ఈయేడు కడచిన మూడేళ్లకంటెనూ బాగా జరిగాయి. అంతా ఆనందమే, అంతా వినోదమే. కడచిన యేటికంటెనూ మేలురకంగా ఉన్నాయి — ప్రదర్శనాలూ వేడుకలూను. ఈయేడు మొదటి రోజంతా బాలలదే. అన్ని విషయాలూ చూసుకోవలసినవారూ నిర్వహించినవారూ బాలలే. నాటకాలయితేనేమి, వినోదాలయితేనేమి, వేడుకలయితేనేమి—అన్నీ నిర్వహించినవారూ, ఏర్పాటు చేసినవారూ, కార్యకలాపం జరిగించినవారూ బాలానంద సంఘంవారే—బాలలే. ఈ నిర్వహణలో, ఈ కార్యకలాపంలో అన్నయ్యకు పెత్తనం లేదు. అక్కయ్యకు జోక్యం లేదు. పూర్తిగా బాలలకే విడిచిపెట్టారు వాళ్లపను లన్నీని. కాని అక్కయ్యా అన్నయ్యా క్రీగంట కనిపెడుతూనే ఉన్నారు. బాలల వాకచక్యానికీ, బాలల ప్రజ్ఞాపాటవానికీ మురిసిపోయారు అక్కయ్యా అన్నయ్యాను. రెండవరోజు కార్యకలాపమంతా పెద్దబాలలు అక్కయ్య అన్నయ్యలదీని. ఆనాటి వేడుకలూ వినోదాలూ ప్లాను చేసినవారూ నిర్వహించిన వారూ అన్నయ్యాలక్కయ్యాను. పెత్తనమంతా వాళ్లది. మొదటి రోజుకంటె రెండో రోజు బాగుంది. కడచినయేటి వినోదాలకంటె ఈయేటివి మేలురకమైనవి. నిర్వహణా ప్రశస్తంగానే ఉంది. ఉత్సవాలు మొత్తంమీద కడచినయేటి ఉత్సవాలకంటె బాగున్నాయి. వచ్చే యేటి ఉత్సవాలు ఈయేటి ఉత్సవాలకంటె బాగుంటాయి.

బాలలకు కొదవ లేదు. పెద్ద బాలలు అక్కయ్య అన్నయ్యల నైపుణ్యానికీ ప్రజ్ఞకూ కొదవలేదు. ఇక కొదవల్లా ప్రజ లిచ్చే ప్రోత్సాహంలో వుంది. తలిదండ్రులు చూపే శ్రద్ధ లోనూ ఔదార్యంలోనూ ఉంది. ఇది పెద్ద ఉద్యమం. శక్తిమంతమైన ఉద్యమం. ఈ ఉద్యమానికి ధనాఢ్యులు ధన సహాయం చేసీ ప్రజలు ప్రోత్సాహ మిచ్చీ, తలిదండ్రులు ఆదరాభిమానాలు చూపీ అక్కయ్యకూ అన్నయ్యకూ తోడ్పడాలి; ఎవరికి తోచినట్లు వారు సహాయపడాలి. నేటి పిల్లకాయలని నిరసన కూడదు. అక్కయ్యా అన్నయ్యా సృష్టిస్తున్నది రేపటి తెనుగు దేశం. మన తోడ్పాటు ఎంత అధికంగా ఉంటే భావి ఆంధ్రదేశం అంత ఉజ్వలంగా ఉంటుంది.

అక్కయ్యకూ అన్నయ్యకూ ఒక్కమాట. భౌతిక శాస్త్రాలలోని విశేషాలు కనిపెట్టేటందుకు ఎందరో మహానుభావులు తమ జీవితాలు ధారపోశారు. ఎందరో అష్టకష్టాలూ పడి తమ ప్రాణాలు ధారపోస్తేనే ఇప్పటి ప్రపంచం తెలియవచ్చింది. అడుగడుగుకూ తన్ను దాను బలి యిచ్చుకొని మానవుడు విజ్ఞానం ఆర్జించాడు. మనుష్యుని బలిదానంవల్లనే మనం నేటి యీ ఉన్నతస్థితికి వచ్చాము. సృష్టి రహస్యాలు తెలుసుకొన్నాం. ఇట్టి వారి గాథలన్నీ కథలుగా చెప్పాలి బాలలకు. ఇట్టి వారి జీవితాలు నాటకాలుగా ఆడించాలి బాలలచేత. ఇట్టివి చెప్పి వారిలో విజ్ఞానతృష్ణ పెంపొందించాలి. వారిలో ధైర్యమూ సాహసమూ వర్ధిల్లజేయాలి. ప్రపంచంలో సభ్యతనూ విజ్ఞానాన్నీ పెంపొందించడానికి కృషి చేసిన మహాత్ములు—ఏ జాతివారయినా సరే, ఏ దేశం వారయినా సరే—మన పిల్లలకు కథల రూపంగా నాటకాలరూపంగా పరిచయము కావాలి. ఆసియాఖండంలోని వేరువేరు దేశాలలో నివసించే జాతులనుగురించీ వారి చరిత్రనుగురించీ మన బాలలకు ముఖ్యంగా తెలపాలి. మన ఆదర్శాలు, మన మహాపురుషులు, మన పుణ్యక్షేత్రాలు, మన పూర్వపు రాజధానులు, మన కోటలు, మన పేటలు, మన రేవు పట్టణాలు అన్నిటిని గురించీ పిల్లలకు తెలియజెప్పాలి—అన్నీ కథలరూపంగానే, అన్నీ నాటకాలరూపంగానే. పుస్తకాలలో చదివినదానికంటె విన్నదే బాగా మనస్సుకు పడుతుంది. కథ అయితే మరీ బాగా మనస్సు కెక్కుతాయి. ఇదీ నా సూచన.



# సమస్యలు — పరిష్కారాలు

శ్రీమతి అచ్యుతుని గిరిజ

అన్నీ సవ్యంగావుండి జీవితం సాఫీగా, సుఖంగా జరిగిపోతున్నంత కాలం ఏ సమస్యా వుండదు. కొన్ని హెచ్చుతగ్గు వచ్చి అంతా అనుకూలంగా అందుబాటులో లేనప్పుడు అది సమస్య అవుతుంది. వచ్చే ఎలక్షన్లలో మళ్లీ మంత్రి పదవిని సంపాదించుకోవటం ఎట్లాగనేది మంత్రిగారి సమస్య. ఏ కాలేజిలోను సీటు రాకపోతే యేమిచేయటమనేది విద్యార్థి సమస్య. పిల్లలకు చదువు సంధ్యలు చెప్పిస్తూ బ్లాకు మార్కెట్టు ధాటీకి ఆగి ఒకచేత్తో జమను, ఒకచేత్తో ఖర్చును అదుపులో వుంచుకోవటమెట్లాగనేది సామాన్య గృహస్థు సమస్య. ఇట్లా ప్రతివాళ్లకు వాళ్లకు తగిన సమస్యలు నిత్యజీవితంలో ఎన్నో వుంటయ్. సమస్యలు వేరువేరుగా వున్నప్పటికి ప్రతివాళ్ల ఆశయం వాటిని వీలయినంత అనుకూలంగా పరిష్కరించటమే. కానీ, సమస్యను సరిఅయిన దృష్టికోణములోంచి గమనించి విశాలభావంతో ఆలోచించితేనే తప్ప అసలయిన పరిష్కారం సిద్ధించదు. తప్పుకోణములోనుంచి చూస్తే తప్పు మార్గమే కనిపిస్తుంది.

ఉదాహరణకు స్త్రీల చదువులు, వుద్యోగాల సంగతి చూతాం. ఈ రోజుల్లో స్త్రీలకు చదువు అవసరమా అని అడిగితే అంతా నవ్వుతారు. అవసరమే నంటున్నారు. తలిదండ్రులు వ్యయ ప్రయాసలకోర్చి చదివించుతున్నారు. అమ్మాయిలు కూడ కష్టపడి చదివి మక్కువతో డిగ్రీలు సంపాదించుకుంటున్నారు. మునపటి పెళ్లి సంగీతమల్లేకాక నిజంగా ఆసక్తితో సంగీతం నేర్చుకుంటున్నారు. వీళ్లలో వ్యక్తిగతంగా యింత మార్పు వున్నా, వీళ్లకు కలగవలసినంత ప్రయోజనం కలగటల్లేదు. వధువు చదువు వయసు ఎక్కువైన కొద్దీ రావలసిన వరుడి హోదాకూడా పెరిగి చివరకు అలభ్యమయ్యే స్థితికి వస్తున్నది. బియ్యం, కూరలు ధరలు హెచ్చినట్లే పెళ్లి కొడుకుల ధరకూడ హెచ్చిపోయింది. ఇదివరకు రెండువేలిచ్చే చోట యిప్పుడు ఆరువేలు కావాలంటారు. అయితే ఆడపిల్లల పెళ్లికీ, చదువుకీ ఏమి సంబంధం? మొగపిల్లలల్లేనే వీళ్లుకూడ ఎందుకు చదవకూడదని ప్రశ్నించవచ్చు. అవును, నిజమే. కాని మొగవాళ్లకే తగిన వుద్యోగాలు దొరక్క అవస్థ పడుతున్న యీరోజుల్లో చదువుకున్న అమ్మాయి లందరూ మాకు వుద్యోగాలే కావాలంటే అదిమటుకు సాధ్యమా? అందులోను వాళ్లకు కొన్నివిధాలయిన వుద్యోగాలే వుపకరించుతవి. శరీరకష్టం ఎక్కువ లేక, జీతం ఎక్కువగా వున్న వుద్యోగాలన్నీ చూసి స్త్రీలకే యిస్తే అంతా హర్షించుతారా?

ఆహార సంపాదించి సంసారాలను పోషించ వలసిన యువకు లెందరో నిరుద్యోగులవుతారు. స్త్రీ పురుష వివక్షత లేకుండ కావాలని అడిగిన వారికి కావలసిన వుద్యోగాలు యివ్వటానికి ప్రస్తుత పరిస్థితులలో అవకాశం లేదు. భారీ ఎత్తున వ్యవసాయం జరపాలి. పెద్దపెద్ద పరిశ్రమలు నెలకొల్పాలి. అనేక యంత్రాగారాలు నిర్మించాలి. అంటే దేశ ఆర్థిక వ్యవస్థలోనే కొన్ని పెద్దమార్పులు రావలసి వుంటుంది. అటుచేసి యిటుచేసి స్త్రీల చదువూ, వుద్యోగాలనేదీ దేశ ఆర్థిక సమస్యగా తేలింది.

కాని దీనిని చాలామంది, అందులోను ముఖ్యంగా స్త్రీలు తమకే సంబంధించిన సమస్యగా ఎంచుతారు. తమకు న్యాయం కలగటల్లేదని, పురుషులు స్వార్థపరత్వంతో అడ్డుకుంటున్నారని అంటారు. సమస్యను సంకుచిత దృష్టితో పరిశీలించటాన పరిష్కార విధానం కూడ అట్లాగే తేల్తుంది. అందువల్ల యేసమస్యనుగాని యిది ఫలానావారికి మాత్రమే సంబంధించినదని పైపై విషయాలను పట్టి నిర్ణయించకూడదు. లోతుపాతులు సరిగా విచారించి తగిన పరిష్కారమార్గం ఆలోచించాలి. అప్పుడే ఏనాటికయినా ఆ సమస్య విడిపోగల అవకాశం వుంటుంది.

ఈనాడు అనేక విధాలుగా ప్రజానష్టం కలుగుతున్నది. భూకంపాలు, వరదలు, రైళ్ళ ప్రమాదాలు, అంతఃకలహాలు, యుద్ధాలు ఎంతగానో ప్రజానష్టం కలిగిస్తున్నప్పటికీ జనోత్పత్తి చాలా అధికంగా వుందని అంటున్నారు. అధిక జనోత్పత్తి వల్లనే ఆహారం చాలటల్లేదని కొంతమంది గునుస్తున్నారు. 22 ఏళ్లుదాటిన తరువాత ఆడపిల్లలకు పెళ్లిచేస్తే బలిష్ఠమయిన పిల్లలు మితంగా పుడతారని మన ఆరోగ్యశాఖామంత్రిణి అమృత కౌర్ గారి ఊహ. ఇంకా కొంతమంది తీవ్రవాదులు సంతాన నిరోధక విధానం ఆచరణలోకి రావాలంటున్నారు. పుట్టి పెరగబోయే జన్మాల సంగతి వీళ్లందరు ఆలోచిస్తుంటే వొక విషప్పు మహాశయుడు పుట్టి పెరుగుతున్న వారి ప్రాణాలకే ఎసరుపెట్టాడు. ఆయన దృష్టిలో—దారిద్ర్యం, కరువు నశించాలంటే జనం నశించాలి. అందుకొక సూక్ష్మమార్గం కూడ చూపించి నాడు. వ్యాధి పీడితులు, అంగవిహీనులు అశక్తులయినవాళ్లు తాము సుఖపడలేకపోగా యితరులకు బాధాకరంగా, భారంగా వున్నారట. కాబట్టి వాళ్లమీద దయ తలచి జాలిపడి వాళ్లను నిర్మూలించగలిగితే సమస్య అంతా తీరిపోతుందట. ఏమి అమానుష భావనలు! మానవజాతి మీద యింత జాలి, ప్రేమ వున్నవాళ్లు బాధితుల శారీరక బాధలు తీరేట్లు వుపచారాలు, వైద్యసహాయం ఎందుకు చేయకూడదు? శక్తిసామర్థ్యాలన్నీ ఉపయోగించి చచ్చు పుచ్చు మనుష్యులు పుట్టకుండా బలిష్ఠులుగానే పుట్టే మార్గాలు ఎందుకు ఆలోచించకూడదు? చివరకు ఆహార సమస్యకు మాత్రం యిది ఎల్లాంటి పరిష్కారం కాగలుగుతుంది? ఆహారం ఎక్కువగా ఉత్పత్తి చేసేసాధనాలు ఆలోచించవచ్చు. వర్తకరీత్యా లాభదాయకమే అయిన యితర పంటలను కొంత మాని, ఆహార పంటలనే ఎక్కువగా పండించవచ్చు. ఆధునిక సాధన సంపత్తితో ఆహారం అధికంగా ఉత్పత్తి అయ్యే మార్గాలు ఎన్నో వున్నయ్. అందుచేత తేలేదేమిటంటే చిన్నదిగాని పెద్దదిగాని ఏసమస్యనైనా సరి అయిన దృష్టితో గమనించితేనే తప్ప సరి అయిన పరిష్కారమార్గం గోచరించదు. తప్పు కోణంలోనుంచి చూస్తే తప్పుదోవే నికపిస్తుంది.

# భరతనాట్యము

శ్రీ ఎస్. వి. రమణరావు

దక్షిణ హిందూదేశంలో యిప్పుడు ఎక్కువ ప్రచారంలో ఉన్న నృత్య పద్ధతులు రెండు: 1. భరత నాట్యము. 2. కథ కళి. భరత నాట్యము అభినయము అను పేరుతో యిప్పుడు దక్షిణ హిందూదేశంలో స్త్రీలు ప్రదర్శిస్తూ ఉన్నదే భరత నాట్యము. ఈ ప్రదర్శనలు రెండు మొదలు మూడు గంటల వరకూ పరిమితి గలిగిన కొన్ని అయిటములు మాత్రమే. ఈ ప్రదర్శనలు స్త్రీలే ప్రదర్శిస్తు న్నారు. ఈ ప్రదర్శనలు అలరిప్పు అనే అయిట ముతో మొదలుపెట్టి తిల్లానా అనే నృత్య ముతో ఆఖరు అవుతాయి.



1. అలరిప్పు: ఇది నృత్య ప్రధాన మైనది. దీనిలో కొన్ని అడుగులు, అంగ విన్యాసములు, దేహ భంగిమలు కలిగి ఉంటుంది. అభినయ మేమీ ఉండదు. సాధారణ ముగా వెనుక నాట్యాచార్యుడు ఒక శబ్దము చెపుతూ ఉంటాడు. ఈ శబ్దానికి నృత్యం చేయబడుతుంది. ఇది ప్రథమ నృత్యం.

2. జతి స్వరం: ఇది కూడా అభి నయము లేని నృత్య ప్రధానమైనదే. దీనిలో కొన్నిరకములైన అడుగులు ఉంటాయి. ఒకే తాళంలో నాలుగు అయిదు రకముల తాళముల యొక్క గతులును జతులును ఉండి ముక్తాయితో ఆఖరు అవుతాయి. దీనికి వెనుక జతిస్వరం పాడతారు. జతిస్వరం అంటే జతి అనగా శబ్దము, స్వరమునూ కలసినదన్న అర్థం. ఈ జతిస్వరంలో సాహిత్యము ఉండదు. జతి స్వరం సాధారణంగా రూపకతాళంలో ఉంటుంది. తాళమునకు అనుగుణంగా మెడ, కండ్లు, కనుబొమ్మలు, చేతులు. రెండు మూడు చిన్న గతులలో కదపడం జతి స్వరంలోనూ తిల్లానాలోను గల ప్రత్యేకత.

3. శబ్దము: ఈ అయిటమునకు శబ్దం అనేపేరు నేతిబీర కాయ వంటిది. ఎందుచేత నంటే దీనిలో శబ్దము ఉండదు. రాముని మీదనో, కృష్ణుని మీదనో, మైసూరు మహారాజు మీదనో రచింపబడిన పాటకు అభినయం చేస్తూ చరణం అయిన తర్వాత మాత్రం ఒక శబ్దం ఉంటుంది. ఈ అన్ని చరణాలకూ తర్వాత అదేశబ్దం మళ్లీ చెప్పబడుతుంది. శబ్దానికి ప్రాధాన్యం లేని ఈ అయిటమునకు శబ్దం అనిపేరు పెట్టడం విచిత్రం. ఈ శబ్దం అభినయం రెండు మూడు నిమిషాల కంటే ఎక్కువపట్టదు. ఈ శబ్దంలోని పాట తెలుగు భాషలో ఉంటుంది. అన్నిశబ్దములూ తెలుగు పాటలే.

4. వర్ణము: వర్ణములో అభినయము. నృత్తముకూడా సమానంగా ఉంటాయి. ఇది సంపూర్ణమైన నృత్యము. వర్ణాభినయము చాలా కష్టమయినది. వర్ణములు అన్నీ తెలుగు భాషలోనే ఉంటాయి. సాధారణంగా శ్రీకృష్ణుని మీద శృంగార రసంలో వ్రాయబడి ఉంటాయి. ఈ వర్ణాభినయం అరగంటనుంచి గంట వరకూ పడుతుంది. చూచేవాళ్లంటే ఎంత సేపైనా అభినయించవచ్చు. దీనిలో అనేక రకములైన శబ్దములు, జతులు, ముక్తాయిలు, గతులు ఉంటాయి. వర్ణాభినయము నర్తకి యొక్క శక్తి సామర్థ్యాలకు గీటురాయి. వర్ణాభినయము చేసిన తర్వాత నర్తకి అలసి పోతుంది. దీని తరువాత విశ్రాంతి అవసరం.

5. పదాభినయం: విశ్రాంతితరువాత పదాభినయం. పదాభినయం అంటే కొన్ని పదము లనబడే పాటలకు, జావళీలకు అభినయం చేయడం. దీనిలో నృత్తమేమీ ఉండదు. ఒక భరతనాట్య ప్రదర్శనలో అథమం నాలుగు పదాలయినా ఉంటాయి. ఈ పదాలన్నీ నిన్న మొన్నటివరకు తెలుగు పాటలే. ఇప్పు డిప్పుడు కొన్ని అరవపదాలుకూడా చేరుస్తున్నారు. "మధురా నగరిలో" అన్న పదం తప్పకుండా ఉండి తీరుతుంది. ప్రదర్శన పరిమితినిబట్టి ఒక్కొక్కప్పుడు ఒక ప్రదర్శనంలో 8 వరకూ కూడా పదములుంటాయి.

6. నటనమాడినార్: పదాభినయం తరువాత నటనమాడినార్ అనే పాటకు అభినయమూ, నృత్తమూను. చిదంబరంలోని కనకసభలో నటరాజు నృత్యం చేసినారనీ ఆ నృత్యము ఎలా వుందో వర్ణిస్తూ రచించిన పాటకు అనుగుణ్యమైన అభినయము, నటరాజ తాండవమును పోలిన నృత్తమూ కలిసి ఉంటుంది. ఇది అరవపాట, "శివుడూ తాండవమూ చేసెనూ కైలాసగిరిలో" అన్నట్లు అర్థమిస్తుంది పాట.

తిల్లానా: భరతనాట్య ప్రదర్శనలో తిల్లానా ఆఖరి అయిటము. తిల్లానా, జాతిస్వరంలా ఉంటుంది నృత్తము; కానీ తిల్లానాలో సాహిత్యం, సాహిత్యానికి అభినయమూ కూడా ఉంటాయి. శబ్దం పాటగా పాడుచున్నట్లు ఉంటుంది. పల్లవినే అనేకసార్లు పాడి దానికే యితర గతులలో అడుగులు చూపించి, ముక్తాయి యిచ్చి, మళ్లీ అదే పల్లవిని యింకొక గతిలో చూపిస్తారు.

కైన్నెర

ఈ పైని చెప్పబడిన అయిటములను కలిపి ఒక ప్రదర్శనగా యిస్తోన్నదే భరత నాట్యము. చాలా కాలంనుండీ కూడా యిది ఆచారంగా వస్తోంది. కాని యిప్పుడిప్పుడు కొంత మంది తమ ప్రదర్శనలలో, మధ్య మధ్య దుస్తులనుమార్చి జిప్సీ డాన్సు అనీ, మార్వాడీ డాన్సు అనీ, పాములవాని డాన్సు అనీ ప్రదర్శిస్తున్నారు. ఈ విధమైన నాట్యా లలో శాస్త్ర యుక్తమైన నృత్తిగానీ, అభిన యంగానీ ఉండదు. నేటి సినీమా నాట్యాలవలె, యిష్టమువచ్చినట్లు చేతులు, యితర అవయ వాలూ కదుపుతారు. ఏ నృత్యమైనా, చేసే నర్తకియొక్క సౌందర్యం, దేహ సౌష్ఠవం, భావప్రకటనాశక్తి, ఎంతసేపు నృత్యం చేసినా అలవకపోవడం, అడుగులు సునాయా సంగా త్వరగా వేయగలిగిన శక్తి పీటిమీద ఆధారపడి ఉంటుంది. ఎందుచేతనంటె ముఖ్యంగా ఈ భరతనాట్యం, తనంతట తానుగా ఆకర్షించలేదు. ప్రజల నాకర్షించగల కథగానీ, సన్నివేశంగానీ యీ ప్రదర్శనలలో ఉండవు. అదీగాక ఒకే వొక స్త్రీ రెండు నుంచి మూడు గంటలవరకు ప్రదర్శించే యీ ప్రదర్శన సాధారణంగా ఎక్కువ ప్రజల యొక్క ఆమోదాన్ని పొందలేకపోవడంలో ఆశ్చర్యంలేదు.

ఈ భరతనాట్యం ప్రదర్శించే నర్తకి యొక్క దుస్తులు, కాళ్ళ నంటిపెట్టుకుని యున్న పైజామా, కూర్చున్నప్పుడు విసన కఱ్ఱవలె విప్పుకొను కుచ్చెళ్లు, వంటికి రవికె, రవికెకుకూడా ముందు కుచ్చెళ్లు ఉంటాయి. ఇవి నర్తకియొక్క ఆర్థిక పరిస్థితుల ననుస రించి ఎక్కువ ఖరీదైన టిస్యూ గుడ్డగానీ, సాధారణమైన పట్టుగుడ్డతోకానీ కుట్టుతారు. కాళ్ళమీద నిలువుగా వచ్చేటట్లు జరీ అంచులు ఉంటాయి.

ఆ పైన బంగారు, రాళ్లుగల నగలు, మొన్నటివరకూ ప్రాచీనసాంప్రదాయ సిద్ధమైన వడ్డాణము, కాసులపేరు, రాగిడీ, చంద్రవంక, సూర్యుడు, చంద్రుడు, నాగరము, అడ్డబాస ధరిస్తుందేవారు. ఇప్పుడు కాలానుగుణంగా, దుస్తులు, నగలు మారుతున్నాయి.

వెనుకప్రక్క వంతపాటకు కర్ణాటక సంగీ తము బాగుగా తెలిసిన గాయకురాలు పాటలను పాడుతుంది. నృత్యం నేర్పిన నాట్యాచార్యుడు తాళం వేస్తూ శబ్దాలు నోటితో చెవుతూ ఉం టాడు. శ్రుతికి తంబురి, ఆపైని శక్తి కొద్దీ వీణ, ఫ్లూటు, వైలిన్, క్లేరియనెట్ మొదలైన వాద్యములు,మృదంగము మాత్రము ముఖ్యం.

ఈ భరతనాట్యం, స్వల్పమైన అభిన యము మార్పులు, శబ్దములు జతులు మార్పు లతో తంజావూరు భరతనాట్యమనీ, పంద నల్లూరు భరతనాట్యమనీ రెండు రకములు. ఈ రెండింటికీ విశేషమైన తేడాలేదు.

భరతనాట్యంనేర్పే గురువులు నట్టువనారులు అని పిలువబడే పురుషులు. వీరు స్త్రీలకు నేర్పుతారు. నట్టువనార్లు అరవలు.వీరికి తెలుగు భాష రాదు. తెలుగు భాషతో నిండిన యీ భరతనాట్యమును యీ తెలుగుపాటలను నట్టు వనార్లు తమ తండ్రితాతల దగ్గరనుంచి సాం ప్రదాయ సిద్ధంగా నేర్చుకొని, తమ శిష్యులకు

నేర్పుతున్నారు. వంశపారంపర్యంగా వస్తోన్న వృత్తి విద్యను నేర్చుకొన్నది నేర్చుకొన్నట్లుగానే నేర్పుతారు. ఎవరు నేర్పినా, ఎవరు నేర్చుకొన్నా, ఎవరు ప్రదర్శించినా భరత నాట్యము అనే పేరుతో నేటికి నిలచిఉన్న నృత్య స్వరూపం పైన చెప్పిన కొన్ని అయిటములు మాత్రమే. శాస్త్రం, అనగా ముద్రలు, భ్రూభేదములు, శిరోభేదములు, దృష్టిభేదములు, కరణములు, అంగహారములు మొదలైనవి నేర్చుకోనందున నేటి యీ భరత నాట్య గురువులుగానీ, నర్తకీమణులుగాని స్వయంగా ఏ కీర్తననైనా అభినయింపలేక పోతున్నారు.

శాస్త్రం తెలిసిఉన్నట్లయితే ఏ భావమునైనా, ముద్రలు మొదలయినవాటి సహాయం చేత, సునాయాసంగా ప్రదర్శించవచ్చును. భరతనాట్య శాస్త్రంలోను, అభినయ దర్పణంలోనూ యీ పద్ధతులన్నీ వివరంగా వ్రాయబడి ఉన్నాయి. గ్రంథస్థమయిన యీ విషయాలను నట్టువనార్లుగాని నర్తకీ నర్తకులుగానీ ఆచరణలో పెట్టకపోవడం భరతనాట్యానికి పెద్ద లోపం. అందుచేతనే నేడు ప్రచారంలోఉన్న భరతనాట్యంలో అభినయానికంటె నృత్తానికి ఎక్కువ ప్రాముఖ్యత ఉంది. ఈ అయిటములు నేర్చుకొన్న బుద్ధిమంతులు, ఏ పాటలకైనా, ఏ తాళంలోనైనా నృత్తమును కూర్చవచ్చును. ఈ జతిస్వరము, వర్ణము, తిల్లానా మొదలయిన అయిటములలో ఎన్నో రకములయిన అడుగులు, జతులు ఉన్నాయి. ఇన్ని రకములయిన గతులలో యిన్ని అడుగులు హిందూదేశంలోని యితర ఏ నాట్య పద్ధతిలోనూ కూడా లేవు.

ఇప్పుడు అనేకమంది నట్టువనార్లు సాధ్యమయినంత త్వరలో ఈ భరతనాట్యమును శిష్యులకు నేర్పి ధనార్జన చేద్దామనుకోవడం వల్లనూ, కొంతమంది స్త్రీలు త్వరలో ఈ భరతనాట్యము అభ్యసించి నర్తకి అని పేరు పొందుదామనే వాంఛచేతనూ సాంప్రదాయ సిద్ధంగా వచ్చే భరతనాట్యం అయిటములను వారి యిష్టము వచ్చినట్లు మార్చి, నేటి సినీమాలలోని నాట్యాలవలె కొన్ని అంగవిన్యాసాలనూ, ఊపులనూ చేర్చి, ప్రేక్షకులలో నీచ భావాన్ని కలిగిస్తున్నారు. విశేష శ్రమలేకుండా, ధనార్జన చేద్దామనీ, పేరు పొందుదామనీ ఆశించడం సహజమే. ఎంతో కాలమునుండీ వస్తోన్న ఆచారాన్ని యీనాడు మార్చడం మంచిదికాదు. మహాభారతాన్ని, రామాయణాన్ని మార్చకూడదు. త్యాగరాజకీర్తనలను మార్చకూడదు. అలాగే సాంప్రదాయ సిద్ధమైన యీ నృత్యాలను అలాగే నేర్చుకోవాలి; నేర్పాలి; శ్రమపడాలి. శక్తివుంటే వాటినిబోలిన నృత్యాలుగాని, అంతకంటే అందమైనవిగాని కూర్చి నేర్పాలి. నేర్చుకోవాలి. మార్పు చేస్తూంటే అమార్పుకి అంతముండదు. కొంత కాలానికి శాస్త్రయుక్తమైన, నృత్యాల నామ రూపాలు నశించి, అర్థంలేని ఊపులు, వంపులు గల గంతులు మాత్రం నిలుస్తాయి.

ఈ విధంగా యీ భరతనాట్యం అయిటములను పిల్లలకు నేర్పి, నట్టువనార్లు ఆ బాలికలచేత ప్రథమ ప్రదర్శన ఏర్పాటు చేస్తారు.



కి న్నె ర

ఈ ప్రథమ ప్రదర్శనానికి అరవంలో అరంగేట్రల్ అంటారు. ముందు వివరించినట్లు నృత్యంలోకంటె బాలికలో విశేషముంటే యీ అరంగేట్రల్‌తో ఆ బాలికయొక్క భావి తేలుతుంది.సాధారణంగా నూటికి 90 ప్రథమప్రదర్శనలు ఆఖరు ప్రదర్శనలుకూడా అవుతోంటాయి, అనేక కారణా లున్నాయి దీనికి.

ఈ భరతనాట్యానికి సంబంధించిన పాటలన్నీ తెలుగులోనే ఉన్నాయి. ఇప్పుడిప్పుడు కొన్ని అరవపాటలను చేరుస్తున్నారు. కాని తెలుగు పాటలను పూర్తిగా తీసివేయలేదు. తీసివెయ్యలేరేమో కూడాను. ఆదిలో తెలుగువారే యీ భరతనాట్యాన్ని ప్రచారం చేసి వుండవచ్చు. కాని నేడు అరవవారే యీ భరతనాట్యాన్ని ఎక్కువ ప్రచారం చేస్తున్నారనడం నిర్వివాదం. త్యాగరాజ కీర్తనలవలె, భరతనాట్యంకూడా ఆంధ్రులకంటె అరవవారే ఎక్కువ ప్రచారం చేశారు, చేస్తున్నారు. భరతనాట్యం అరవలదా, ఆంధ్రులదా అన్న తర్కం మన కనవసరం. భారతనాట్యం కనుక భారతీయులందరికీ సమానమైన హక్కు ఉంది. ఇంతవరకూ భరతనాట్యాన్ని యీ రూపంలోనైనా ప్రచారం చేస్తూ నిలవబెట్టినందుకు ముఖ్యంగా అరవవారికి, నర్తకీ, నర్తకులకు, నట్టువనార్లకు భారతీయులందరూ కృతజ్ఞులై యుంటారు.

వినోదంకోసం, విజ్ఞానంకోసం, జీవనోపాధికోసం అనేకమంది యీ భరతనాట్యాన్ని అభ్యసిస్తున్నారు. కాని యీ భరతనాట్యం. అసంపూర్ణంగానే ఉంది. కొన్ని అయిటములనుమాత్రం చూపించి యిదే భరతనాట్యమంటే హాస్యాస్పదంగా ఉంటుంది. శాస్త్రయుక్తమైన పద్ధతులన్నీ భరతనాట్య శాస్త్రంలోనూ, అభినయ దర్పణంలోనూ సంపూర్ణంగా వివరింపబడి ఉన్నాయి. కాని ఇవి ఆచరణలో ఎవరూ పెట్టటం లేదు. గ్రంథస్థమయిన యీ శాస్త్రాన్ని ఆచరణలో పెట్టేందుకు ప్రభుత్వం దోహదం చెయ్యాలి. సంస్కృత భాషలో ఉన్న నాట్యశాస్త్రాన్ని హిందూదేశంలోని అన్ని భాషలలోనికి తర్జుమా చేయించాలి.

సంస్కృత పండితుల చేత, నాట్యాచార్యుల చేత పరిశోధనలు చేయించి, అభిలాషగల యువతీయువకులకు ఈనాట్యశాస్త్రాన్ని నేర్పించాలి. ఈ బాధ్యత ప్రభుత్వం వహించాలి. ఉచితంగా నృత్యం నేర్పే పాఠశాలలను నెలకొల్పి గాని, పాఠశాలలో నృత్యం ఉచితంగా నేర్పే ఏర్పాటుగాని చేసినప్పుడు అనేకమంది నృత్యం అభ్యసించడానికి ముందుకు వస్తారు. బాలికా పాఠశాలలలో నృత్యం కూడా ప్రవేశపెట్ట బోతున్నారని తెలుస్తోంది. ఇది చాలా సదవకాశం. ఈ అవకాశాన్ని వినియోగించుకొని తలిదండ్రులు బాలికల కయినా యీనృత్యం నేర్పిస్తారని ఆశ. సినీమా నృత్యాల ననుకరించి చేతులు తిప్పుతూంటే మురిసిపోయే తల్లిదండ్రులు, అంతటితో తృప్తిచెందక అవకాశం కలిగినప్పుడయినా బాలికలకు నృత్యం నేర్పించాలి.

నృత్యం నేర్చుకోవడంవల్ల నష్టమేమీలేదు. పైనిపైగా ఎన్నో ఉపయోగాలున్నాయి. శరీరారోగ్యం కాపాడుకొనే పరిశ్రమగా ఉపయోగపడుతుంది. ఆరోగ్యంవల్ల ఆనందం. జీవితంలోని మాధుర్యం సంపూర్ణంగా అనుభవించడానికి కళారాధన ఎంతో అవసరం.నృత్యం ఉత్తమమైన కళ.




## కాంతం.

కథల సంపుటి. కర్త: శ్రీ ముని మాణిక్యం నరసింహారావుగారు. పుటలు 104. వెల రూపాయి. ప్రతులకు : మునిమాణిక్యం నరసింహారావు, మచిలీపట్నము. (ముద్రణ 1944)

"కాంతం" కథలని గురించీ, మునిమాణిక్యం గారిని గురించీ యెరగనివారు తెలుగు దేశంలో ఎవ్వరూ వుండరు. కథాసాహిత్యంలో ఇవి మంచి స్థానాన్ని ఆక్రమించుకున్నాయి. సామాన్యం సంసంసారంలోని ఘట్టాలన్నిటినీఈ కథలు ఉండేవి ఉండేటట్లుగా చిత్రించడమే దీనికి ముఖ్యకారణం: అయినా ఒకసంగతి, కొందరు సంసారంలోని విష యాలని వున్నవి వున్నట్లుగా చూపినా, చమత్కా-రంగా వుండేటట్టు చిత్రించలేరు. అంచేతే ఆ కథలు రక్తికట్టవు. "కాంతం" కథలు అన్నివిధాలా ఉత్తమ శ్రేణికి చెందివున్నాయి. బహూకరణాన్ని పొందినాయి:

"కాంతం"కథలు చదవడం ప్రారంభిస్తే చివరి దాకా చదవాలనే బుద్ధి పుడుతుంది. కాని గ్రంథకర్త యీ కథల నన్నిటినినీ ఒకే మారుగా—ఒకే చిత్త వృత్తితో వ్రాసివుంటారని తోచదు. కొన్ని ఘట్టా లని చూస్తే కాంతం అసాధారణ ప్రజ్ఞావతి అనీ. కొన్ని ఘట్టాలు చూస్తే వట్టి మూర్ఖురాలనీ చదివే వాళ్లకి తోచడమే యీలా అనుకోడానికి కారణం. "ఏప్రిల్-ఫూలు" లో అంత తెలివి తేటలు చూపిన "కాంతం" గుంటూరు ఏలైనులో వున్నదో ఎరగక పోవడంకాని అధవా చెప్పేక కూడ బోధపరుచు కోలేక పోవడంగాని అసంభవ వేమో అనిపిస్తుంది. ఇంగ్లీషు కాస్త నేర్చుకుని, తెలుగువైతేనేమి పేపర్లు—విధిలేకన్నా సరే—ఎప్పుడయినా సరే—చదివే-ఒక ఎల్. టీ. అయ్యవారి భార్య—తెలివైన "కాంతం" "చైనా" అంటే ఏమిటో తెలిసికోలేక పోవడం విచిత్రంగా తోస్తుంది. అయితే "మునిమాణిక్యం"గారు ఏదో సందర్భం తెచ్చి బడిపిల్లల తెలివి తేటల్ని యిలా వెల్లడి చెయ్యడానికి వ్రాసివుండాలి. ఆయన విభిన్న సన్నివేశాల్లో ఇందులోని భాగాలని వ్రాసివుండాలి :

"కాంతం" కథలు ఆకర్షణీయాలే కాదు ; చాలా మంది వీటిని అనుకరించీ, అనుసరించీ గ్రంథాలని వ్రాస్తున్నారు. కాని ఏమాత్రమూ కృతార్థులు కాకుండా వున్నారు. ఈ కథల విశిష్టతని తెలసికోవ డానికి ఈ విషయం చాలును.

బు. వేం. ర.

కిన్నెర

# దూరపు కొండలు

విజ్ఞాన కథల సంపుటి. రచన : జ్యోతి కుమారి. క్రౌను 96 పుటలు. వెల రూపాయి. ప్రకాశకులు : ఫణిలాండ్ ఏజన్సీస్, కర్నూలు.

ఇది జ్యోతి ప్రచురణాల్లో మొట్టమొదటిపుస్తకం. అట్టమీద ఆకర్షణీయమైన చిత్రం "పుల్లేశ్వర్" చిత్రించినది వున్నది. ఇందులో "దూరపుకొండలు" మొదలైన కథలు పది వున్నాయి.

"ప్రముఖ తెలుగు రచయితల ప్రఖ్యాత రచనలను సేకరించి రూపురేఖలు దిద్ది ఆకర్షణీయములగు గ్రంథములుగా విశాలాంధ్రకు అందజేయవలయు ననెడి దృఢవిశ్వాసముతో" ఈ ప్రయత్నానికి సిద్ధపడినట్లు ప్రకాశకులు తెలుపుతున్నారు. గ్రంథానికి "రూపురేఖలు దిద్దడం"లో ప్రకాశకులు శక్తివంచన లేకుండానే కృషి చేయడం చాలా సంతోషించదగ్గ విషయం.

కథకుడు చెప్పే కథలు ఏ రకానికి చెందివున్నా, అవి పాఠకుల మనస్సుని ఆకర్షిస్తూ, చదువుతున్నంతసేపూ "ఫర్వాలేదు ; బాగానే వున్నాది కథ" అనిపించేటట్టు వుండాలి.అలాకాకుండా "ఇంతేనా?" అని నిరుత్సాహాన్ని కలిగించకూడదు ; అలా నిరుత్సాహం కలిగించే కథలవల్ల కలిగే ప్రయోజనం తక్కువ.

"దూరపుకొండలు" అనే కథలో కథాంశం ఏమీ లేదు ; అందరికీ తెలిసిన సంగతే—అలాగే చెప్పబడింది : చమత్కారం ఏమీ లేదు. "ఈకథ ఎందుకు రాసినట్టు?" అనితోస్తుంది, కథ చదివాక.

"వారసుడు" లోని కథ చాలా యేళ్లక్రితం భారతిలో ప్రకటింపబడ్డ కథకి ఒక మోస్తరు కాపీ ; అది అలా కాపీ చేసినా సరిపోయేది; చివరికి లక్ష్మి తన భర్తకి వారసుడిని అప్పగించి, ఆడిన మాటలనుబట్టి అంతా, అభాసంగా తయారైంది. మొదట ఈ కథలు వ్రాసినది పేరునుబట్టి స్త్రీయేమో అని అనుకున్నాను. కథనుబట్టి చూస్తే కాదని స్పష్టంగా తెలిసిపోయింది. గ్రంథకర్త్రి పేరు కల్పితమని. లేదా—నిజంగా, ఆపేరుగల వనితామణే వుంటే—ఎవరో మగవారి కథలు వ్రాసి, ఆ పేరు పెట్టి వుండాలి : కుటుంబరావుగారు "తొలిపలుకు"లో "రచయిత" అనే వాడేరు. అది చదివేటప్పుడు నాకు "ఇలా ఎందుకు రాసేరా?" అని సందేహం కలిగినా, ఆ సందేహం ఈ కథ చదవటంతో తీరిపోయింది. తెరలో దాగిలిమూత లాడుతున్న కథకుడెవరో వున్నాడని అనుకోవలసివస్తున్నాది.

తక్కిన కథలు—అన్నీకూడా, అవి చదివేక—వాటికి మాతృకలు ఇదివరకు చదివినట్లు బాగా జ్ఞాపకం వుంది—తెలుగులోనే—మన పత్రికల్లోనే. కాని కొంతకాలం వ్యవధివుండి, ఆ పత్రికలు లభిస్తేనేగాని, సంపుటాన్ని, సంచికనీ తెలియచేయడం కష్టం.

"కొత్తచీరె"లోని సంభాషణ చమత్కారంగా వుంది. శ్రీ శ్రీపాదవారి అనుకరణ దానిలో బాగా ప్రతిఫలిస్తూవుంది; కాని చివరికి చప్పబడిపోయింది.

ప్రస్తుతంలో కథాసాహిత్యం వృద్ధిపొందడానికి చాలా అవసరమూ, అవకాశాలూ వున్నాయి. అలాటప్పుడు రచయితలు, తాము వ్రాసినవి, రాసినట్లు గానే—చిత్తుస్థితిలోనే అచ్చుకు యిచ్చివెయ్యక బాగా పరిశోధించి, చాలా జాగ్రతగా వ్రాయాలి. ప్రకటితపూర్వాలయిన—ఇతరుల రచనలని తీసికొని, మారు పేర్లుపెట్టి ప్రకటించడం ధర్మం కాదు. కథకులున్నూ, తెరలో దూరక, రంగస్థలానికి వచ్చి "ఈ వీరుణ్ని నేను" అని ధైర్యంతో నిలవాలి. అలా నిలిస్తే అపోహలు చాలా సర్దుకుపోతాయి.

"దూరపుకొండలు" "విజ్ఞాన కథల సంపుటి" అని ముఖపత్రంమీద వ్రాసివుండబట్టే అవి అలాటి కథలేమో అని అనుకోవాలి. కాని, కథలు చదివితే—విజ్ఞానానికీ, ఈ కథలకీ, ఏమాత్రమూ సంబంధ బాంధవ్యాలు లేవని స్పష్టంగా తెలిసిపోయింది.

ఇది "జ్యోతి ప్రచురణ"లవారి తొలి కుసుమం. కాబట్టే యిదే ప్రథమ ప్రయత్నంకూడా అయివుండాలి. ఇక ముందు ఈ "ప్రచురణలు" మంచి కథ లనిపించగలవని మనం ఆశింపవచ్చు.

బు. వేం. ర.

# ఏరిన ముత్యాలు

## "కోలములు"—వారి భాష

రచన: శ్రీ మాడపాటి హనుమంతరావు పంతులు.

"కోలమీ" భాషను పరిశోధించిన వారికి తెలియవచ్చు ప్రధానాంశ మేమనగా, దానిలోని శబ్దజాలము చాలకొద్ది పాటిది. దాని నిఘంటవు, పదసమూహము మొత్తముమీద ఎనిమిది వందల కంటె మించి యుండదు! ఇంతటి కొద్ది సంఖ్యగల పదజాలమున్న భాష ప్రపంచమున మరేదైన ఉండునాయని సందియము తోచును! పైమొత్తములోనుండి క్రియాపదములను విడదీసి చూచినచో, వానిసంఖ్య ఒకవంద ఇరువదియైదుకంటె మించి యుండదను నిశ్చయము కలుగగలదు!

తమ భాషాపదముల సంఖ్య చాల కొద్దిదిగానుండుటకు కారణమేమో కోలములు చెప్పుకొనెదరు. ఆసంగతి వినోదమగు నొక కథ పై ఆధారపడి యున్నది. ప్రపంచవాసులగు జనులకు దేవుడు భాషలను పంచిపెట్టు చుండెనట. ఆసమయమున తక్కిన ప్రజాసమూహములు సరసరి వెళ్లి తమ భాషాపదములను దేవుని వలన బడసి వానిని మూటగట్టుకొని వెళ్లుచుండిరట. దురదృష్టమువలన కోలములకు దారిలో ఆలస్యమైనందున, వారు ఈశ్వర సాన్నిధ్యము చేరుటలో చిట్టచివర వారైరట. అప్పటివరకు శబ్దజాలమంతయు వారివారికి పంచిపెట్టబడెనట! "మాకు భాషాపదములు దయచేయరా" అని కోలములు అడుగగా "మీగతి మీరే చూచుకొనుము! ఇతరులకిచ్చిన శబ్దసముదాయములో నుండి వారివారి వద్ద అప్పు పుచ్చుకొనుడు!" అని దేవుడు ఆజ్ఞ ఇచ్చెనట!

ఇదీ కోలములు చెప్పుకొను సమాధానమట.

"కోలము"ల భాష ద్రావిడీయమై, గోండీభాష, తెలుగుభాష, కన్నడభాషలను పోలియున్నదని ఒక ఆంగ్ల గ్రంథకర్త అభిప్రాయ పడియుండెను.

ఒకటినుండి పదివరకు గల అంకెలు కోలిమి భాషలో నిట్లున్నవి:

(౧) వొక్కొ
(౨) ఇండీ
(౩) ముండీ
(౪) నాలీ
(౫) అయిద్
(౬) ఆర్
(౭) యేదు
(౮) యెనిమిది
(౯) తొంది
(౧౦) పది

పైవానిలో ౨, ౩ తప్ప తక్కినవన్నియు తెలుగువిగానే కానివచ్చుచున్నవి: ౨, ౩ కు వాడబడిన శబ్దములు కన్నడము కావు. ఏభాషవో తెలియదు!

ఇట్లునుటవలన "కోలమి" భాష శబ్దములగు అంకెలలో అన్నియు తెలుగువేయని భ్రమించ గూడదు. ఉదాహరణార్థము, ముప్పది అనుదానిని

అభాషలో "డెడ్డాఇరవే" అందురట! ఈ"ఇరవే" మనఇరవై కాదుగదా డెడ్డాఇరవే అనగా పెద్ద ఇరవై కాదుగదా ఏమో ముప్పది అనడానికి వేరేశబ్దము లేనందున ఆరున్నొక్కటి అన్నట్లు"పెద్దఇరవై" అను శబ్దములు వాడుకొను చున్నారేమో.

—సుజాత (అక్టోబరు 50)

## పూర్వమానవుల ముఖవిశేషాలు

పాతపుర్రెల యెండిన యెముకలమీద పూర్వ మానవుల యథార్థ ముఖవిశేషాలను ప్రదర్శించ కలిగిన రష్యన్ శిల్పి, పురాతత్వవేత్త గెరాసిమావ్ అభినందనీయుడు. పరిశోధకులకు మాత్రమే పరిచయమయిన మానవ మస్తిష్కములను పరీక్షించిన తర్వాత, గెరాసిమావ్ చేసిన పునర్ముఖ నిర్మాణము సరియైనదనీ, పూర్వమానవుల చిహ్నములకూ వీటికీ చాలదగ్గర పోలిక కలదని ఋజువయినది.

అనేక సంవత్సరాలుగా అనేక పూర్వ జీవతత్వ శాస్త్రవేత్తలు, పూర్వమానవుని పుర్రెను ఆధరువు చేసికొని అతని ఆకృతిని నిర్ణయింప ప్రయత్నించి నప్పటికి వారు కృతకృత్యులుకాలేదు. ఎండిన ఎముకనుంచి వ్యక్తిగతలక్షణమును సృష్టించుట అసాధ్యమని యెంచి, పూర్వమానవాకృతిలో దూరసానురూప్య మయిననూ లేని వాస్తవవిరుద్ధము లయిన ఆకృతులను కల్పింప కలిగిరి.

కాని యీ సమస్యను గెరాసిమావ్ మార్క్సిస్టు దృక్పథంనుంచి పరిశీలించగా, ప్రకృతి యంతయు పరస్పర బద్ధమయిన వృత్తమనియు, దానిలో యే ఒక్క విశేష మయిననూ కెండవ దానిమీద ఆధారపడి యుండుననియు గ్రహించెను. ముఖముమీది మృదుపదార్థమునకు, పుర్రెవంపులకూ, వైలక్షణ్యములకూ, ప్రత్యేకతలకూ యేదో ఒక సంబంధముండు ననుకొని, యిరవైసంవత్సరముల పాటు అనేక వేల తలల పొటోలు, ప్లేట్లు సమీకరించెను. శాస్త్రజ్ఞుడేకాక, శిల్పికూడ అయివుండి నందుచేత,

'అతడు పుర్రెకూ, ముఖమునకూగల సంబంధమును గురించి కనిపెట్టిన శాసనమును వెంటనే కార్యరూప మున ప్రదర్శించెను. ఈ ప్రదర్శనముల గురించి పెదవి విరిచినవారు లేకపోలేదు,అతని నిజాయతిని పరీక్షింప నెంచి అతనికి చిక్కు సమస్యలనిచ్చి విడ దీయమనిరి.

1939 లో అసాధారణ మయిన పుర్రె నొకటి యిచ్చి ముఖమును నిర్మించమనిరి. తర్వాత అతను నిర్మించిన దానికీ,అమృతమానవుని ఫోటోకు యేమా త్రము భేదము లేకుండెను. మాస్కో సమాధులలో ఒకదానిలో కనుపించిన ఒక పుర్రెనిచ్చి లక్షణము నిర్ణయించమనిరి. అది యెవరిదో అతనికి తెలియదు కాని అతను పునర్నిర్మించిన ముఖము మేరియా వెడాస్టోస్తాయది. ఆమె రచయిత డాస్టోవెస్కీ తల్లి. రెండింటికిగల తేడా ముక్కుదూలములోనిదే కాని యెక్కువకాదు. తర్వాత యీ తేడా ఆమెను చిత్రిం చిన చిత్రకారుని తప్పిదమువల్లనే కలిగెనని నిర్ధరింప బడినది.

స్కితియా (నల్లసముద్రపు సమీప ప్రాంతము నకు పూర్వపు పేరు) లో చారిత్రక పరిశోధనలు సాగించునపుడు ప్రఖ్యాతుడయిన ఒక యుద్ధవీరుని సమాధి త్రవ్వబడెను. ఆ పుర్రెనుంచి గెరాసిమావ్ మానవాకృతి నిర్మించెను. పూర్వచరిత్రవేత్త యీ శిల్ప ప్రతిమనుచూసి గడ్డమునుకూడ చేర్చమని వుప దేశించగా అతడట్లుచేసెను. "అరే ఆ కనుపించు నది స్కిల్లరు-స్కితియన్లరాజు;" అని ఆ పండి తుడు పూర్వనాణెములమీది ప్రతిమనుపోల్చి నిర్ధరించెను.

గెరాసిమావ్ కృషికి గొప్ప శాస్త్రప్రాధాన్య మున్నది. 1938 లో సోవియటు శాస్త్రవేత్త ఓక్లా డ్నికోవు మధ్య ఏషియాలో పాత రాతియుగ శిథిలములను. అప్పటి ఒకపిల్లవాని అస్థులను కను గొనెను, గెరాసిమావ్ దాని ఆదరువున ముఖము నిర్మించెను. తర్వాత మొత్తము దేహమంతయు నిర్మించగా, నాఆండెర్తాల్ యుగమానవుడు వరు గెత్త జాలడనియు, హస్తములు సంపూర్ణ స్వాధీన ములు కావనియు నిర్ధరింపబడినది. క్రో-మేగ్నాను యుగమానవుని పునర్నిర్మాణ సాఫల్యమువల్ల, మెడ బలిష్ఠము, తల నిటారు; మేధాసంపత్తి, దేహ దార్ఢ్యము సమాన భాగములుగనుండి, ఆదిమ మానవుని మోటతనముగాని, ఆటవిక మృగచిహ్న ములుగాని కనుపించుటలేదు, అని నిర్ధరింపబడినది.

గెరాసిమావ్ పరిశోధనలు ఒక విశిష్ట శాస్త్ర సిద్ధాంతమునకు తొలిపలుకులుమాత్రమే. అతను మార్గదర్శి. ఆకార పునర్నిర్మాణమునకు అస్థిపంజర సహాయము చరిత్రకారులకు పూర్వ జీవశాస్త్రజ్ఞులకు చాల వుపకరించును.

—అరుణరేఖ (అక్టోబరు 50)

## చరిత్రగర్భంలో మరుగుపడుతున్న తోలుబొమ్మలాటల వైచిత్ర్యం

రచన : శ్రీ పి. వి. పతి

మన కిప్పుడు సినీమాలు ఎలాగో, మనపూర్వు లకు తోలుబొమ్మ లాటలు అలాగని చెప్పాలి. కథలను, గాథలను ప్రచారం చెయ్యడానికి మానవ కోటి ఆదినుంచీ ఏదో ఒక సాధనాన్ని అవలం బిస్తూనే వచ్చింది. మానవుని యాంత్రిక విజ్ఞాన ఫలి తంగా అవతరించిన థియేటర్లు, రేడియోలతోపాటు, ఈనాటికీ ప్రాచ్యదేశాలలోని అనేక ప్రాంతాలలో తోలుబొమ్మలాటకు అపారమైన ప్రజాదరమున్నది.

థియేటర్లలోకానీ, దేరాలలోకానీ, బహిరంగ స్థలాలలోకానీ చలన చిత్రాల ప్రదర్శనం ప్రారంభం కావడానికి కొన్ని శతాబ్దాల పూర్వమే ఆంధ్ర, కర్ణా టక ప్రజలు, రంగు రంగులతో తోలుబొమ్మ లాట లను ప్రదర్శించడంలో నేర్పు గడించారు. ఈ

ప్రాంతాలలో ఈనాటికీ ఇవి నిలిచివున్నవి. అందువల్ల చలన చిత్రాల మహత్యం ఒక్క 20 వ శతాబ్దానిది మాత్రమే కాదని భారతీయులు భావిస్తారు.

ఈ తోలుబొమ్మ లాటలను ప్రదర్శించేవారు,—పురుషులతోపాటు, స్త్రీలు, పిల్లలుకూడా—వివిధ ప్రాంతాలలో పర్యటిస్తూ, తమ ప్రదర్శనాల మూలంగా, జనానికి వినోదం కూరుస్తూ, భుక్తి గడుపుకొనేవారు. వారెక్కడకు వెళ్ళినా, అక్కడి ప్రజలందరు వారిని చూడవచ్చేవారు. కాంప్లిమెంటరీ టిక్కెట్లతో వచ్చే ప్రేక్షకులకు మాత్రమే తమ ఆటలనుచూపించేవారుకాదు. పైన ఈ తోలుబొమ్మలాటల వల్ల వర్షాలు కురుస్తవనీ, సౌభాగ్యం సిద్ధిస్తుందనీ గ్రామీణులు నమ్మేవారు. నిజానికి అనావృష్టి యేర్పడ్డప్పుడు గ్రామీణులు ప్రత్యేకంగా డబ్బిచ్చి, తోలుబొమ్మలాటలను ఆడిస్తారు. రాత్రి కాగానే ఆట ప్రారంభమై తెల్లవార్లు సాగుతుంది. సాధారణంగా మత విషయక గాథలే ముఖ్యంగా రామాయణ మహాభారతాలలోని ఇతివృత్తాలే ఎక్కువగా ప్రదర్శించబడుతూ వుంటాయి. బహిరంగ స్థలంలోనే ఇవి జరుగుతాయి. వెదుళ్ళతోను, కొబ్బరి ఆకులతోను, తాటాకులతోను కట్టబడ్డ పందిరిలో వీటిని జరుపుతారు. స్టేజిలో మూడు పక్కల నల్లగుడ్డలు కడతారు. నాలవదిమాత్రం తెల్ల వస్త్రం వుంటుంది. ఇదే తెర అన్నమాట. ఈ తెర నేలపైనుంచి నాలుగయిదు అడుగుల ఎత్తున వుంటుంది. ఈ తెరపైనే తోలుబొమ్మల నీడలు పడతవి. స్టేజి కప్పుకూడా తాటాకులతోనే నిర్మించబడుతవి.

తెర వెనక అయిదు అడుగుల దూరంలో వరుసగా ఆముదం దీపాలు వుంటాయి. ఈ దీపాల మూలంగానే బొమ్మల నీడలు తెరపైన పడతాయి. తెర వెనక ఇద్దరు ముగ్గురు సూత్రధారులుండి ఈ బొమ్మలను ఆడిస్తారన్నమాట. ఒక పక్కన ఈ బొమ్మలను ఆడిస్తూనే, మరొకపక్క ఆ బొమ్మల సంచలనానికి అనుగుణంగా సంభాషణలలోకూడా పాల్గొంటూవుంటారు. సాధారణంగా ఒక స్త్రీ పాట పాడుతూవుంటుంది. పాటతోపాటు ఆటనుగురించీ సముచిత వ్యాఖ్యానంకూడా చేస్తూవుంటుంది. స్త్రీల పాత్రలు మాట్లాడవలసివచ్చినప్పుడు ఈ స్త్రీయే సంభాషణలు జరుపుతుంది. అధునాతన చలనచిత్ర నిర్మాణంతో పరిచయ మున్నవారికి తెలుస్తుంది—తోలుబొమ్మలాటలోని ఈ స్త్రీ నిర్వర్తించే కార్యకలాపాలకు, పాశ్చాత్య చిత్రాలలోని "కంటిన్యుయిటీ గరల్"కు ఎంతో సామ్యం వున్నదని.

తెరమీద ఆడే బొమ్మ లన్నిటినీ తోలుతోనే తయారు చేస్తారు. వివిధ వర్ణాలతో ఇవి చాలా నేర్పుగా తయారు చెయ్యబడుతాయి. బొమ్మలకు అవయవా లన్నీ చాలా వదులుగా అతికించబడి వుంటాయి. అందుకనే వాటినే ఎటుబడితే అటు తిప్పడానికి వీలుంటుందన్నమాట. ప్రతి బొమ్మకు ఒక కర్ర తగిలించబడి వుంటుంది. ఈ కర్ర సహాయంతోనే సూత్రధారి వాటిని ఆడిస్తూవుంటాడు. అవయవాలను, బొమ్మలను కలిపే తాళ్లతోను. ఈ కర్రతోను, బొమ్మలను ఆడిస్తూ, సరిగ్గా మానవ శరీరం కదిలినట్టుగానే ఆబొమ్మలను కదిలించడంలో సూత్రధారి చాలా ప్రావీణ్యం ప్రదర్శిస్తాడు.

ఇక, ఈ బొమ్మల నిర్మాణంలోకూడా కళా సౌష్ఠవం కనబడుతుంది. ఆయా పాత్రల స్వరూప స్వభావాలకు తగినట్టుగా వేషాన్ని కల్పించడంలోను, అలంకరించడంలోనూ ఎంతో విజ్ఞానం చూపిస్తారు. ఒక్కొక్క ఆటలో, ఒక్కొక్క బొమ్మనే అనేక పరిమాణాలలో చూపించవలసివస్తుంది. ఈ బొమ్మల పరిమాణం ఒక అడుగునుంచి ఏడు అడుగులవరకుకూడా వుంటూవుంటుంది. ఈనాడు మన చలనచిత్రాలలో "క్లోజప్పులు", "లాంగ్ షాట్లు" చూపిస్తున్నట్టుగానే పై చెప్పిన వివిధ పరిమాణాలలో ఆనాడుకూడా ఆ "ఎఫెక్టు"ను కలిగించే వా రన్నమాట. అనేకమంది పాత్రలుకానీ—గుంపులు గుంపులుగా కానీ పాల్గొనవలసివచ్చే దృశ్యాలలో, నాలుగైదు బొమ్మలను కలిపి గుచ్చెత్తి, తెరకు ఎడం వైపున, కుడివైపునకూడా వాటిని అమర్చేవారు.

వెనకనున్న దీపాల కాంతి వాటిపై పడగానే రంగు రంగులలో. "మాస్‌షాట్" చూచినట్టుగా వుండేది —ప్రేక్షకులకు.

మన పూర్వకాలపు నాటకా లన్నిటివలెనే తోలుబొమ్మలాటకూడా ప్రార్థన గీతంతో ప్రారంభ మౌతుంది. ఈ గీతాన్ని పైజెప్పిన స్త్రీయే పాడు తుంది. సాధారణంగా వినాయకుని ప్రార్థన చేస్తూ వుంటారు—మరి ఆయనే కదా. విఘ్నాలకు ఈశ్వ రుడు! ఏ లంకాదహనమో ఆడతా రనుకోండి. ముందుగా. రావణాసురుడు సీతను అపహరించిన విషయం ఉపోద్ఘాతప్రాయంగా చెబుతారు. ఆ చెప్పిన దానిని బొమ్మలద్వారాకూడా చూపిస్తారు. ఆ సీతాప హరణం జరిగిన తర్వాత రామదూత అయిన హనుమంతుడు లంకకు వెళ్లి, సీత నిర్బంధంలో వున్న స్థలాన్ని కనుగొన్నట్టు చూపిస్తారు. రాముడు గుర్తుగా యిచ్చిన ఉంగరాన్ని హనుమంతుడు చెట్టుపైనుంచి కిందకు పడవేస్తాడు. సీత దానిని చూచి తన ఉంగరాన్ని అతడికిచ్చి తిరిగి రాముని వద్దకు పంపుతుంది. అంతటితో ఉపోద్ఘాతం ముగు స్తుంది.

ఇక తర్వాత. అసలు కథ ప్రారంభమౌతుంది. కాని ఈ కథాగమనానికి అడ్డు తగులుతూ. మధ్య మధ్య తెరపై ఒక నర్తకి ప్రత్యక్షమౌతూ వుంటుంది. తెరవెనుక వుండే స్త్రీ ఈ నృత్యానికి అనుగుణమైన ఒక గేయాన్ని పాడుతుంది. దానికి తగ్గట్టు తాళం వేస్తారు. ఆ తరుణంలో తెరపై కది లాడే బొమ్మ. ఉత్తమ సంప్రదాయాల ప్రకారం భరతనాట్యం చేస్తున్నట్టుగానే వుంటుంది. ఈ నృత్యం తర్వాత వినోదంకొరకు కొంత తమాషా చూపించేవారు. ఇదికూడా కథకు సంబంధించిన విషయమే. తోలుబొమ్మలాటలో వినోదం కల్పించే నిమిత్తం ఏర్పాటు చెయ్యబడ్డ పాత్ర—కేతిగాడు తెరపై అవతరించగానే ఉన్న ప్రేక్షకులందరు ఒక్కసారి ఘొల్లుమన్నా రన్నమాటే. ఈనాడు చలనచిత్రాలలో చార్లీచాప్లిన్‌కు ఎంత ప్రసిద్ధి వున్నదో ఆంధ్రదేశంలో కేతిగాడికి అంత ప్రసిద్ధి వున్నది. వీడితోపాటు మరొక పాత్రకూడావస్తుంది. వీరిద్దరికే జరిగే చమత్కార సంభాషణతో ఆట చూచేవారందరికీ పొట్ట చెక్కలవుతుంది. ఒక్కొ క్కప్పుడు వీరి చమత్కారం అసభ్యంగా ఉండడం కూడా కద్దు. కాని. వీరి చర్చ కాస్త తీవ్రంగా సాగుతున్న సమయంలో ఉన్నట్టుండి ఒక కొత్త పాత్ర అవతరించడం జరుగుతుంది. సినిమాలలో చూపించే "ఫ్లాష్—వైప్" వలెనే ఈ ఏర్పాటు కూడా చాలా హృద్యంగా ఉంటుంది. అయితే, ఇంతకూ ఆ వచ్చిన కొత్తపాత్ర ఎవరూ కాదు— కేతిగాడి భార్యే! పెళ్ళాం చేతిలో వీడు కీలుబొమ్మ పాపం. అంతకుముందువరకు ఏవో ప్రగల్భాలు పలుకుతున్నవాడుకాస్తా భార్య రాగానే ప్లేటు మార్చే స్తాడు. ఆమెను చూడగానే గడగడ లాడిపోతాడు. చూస్తున్న ప్రేక్షకులు ఒకటే నవ్వు! అందులో ఆ మహా యిల్లాలు భర్తను చెవి పట్టుకొని చావ చితక కొడుతుంటే వీరి హర్షధ్వానాలు మిన్ను ముట్టు తాయి. ఇంతవరకు అక్కడవున్న రెండవ వ్యక్తి తెరపైనుంచి చల్లగా తప్పుకొంటాడు. కేతిగాడు భార్యను బతిమాలి. కాళ్లవేళ్లా బడతాడు. భార్య ముందు గంభీరంగా నడుస్తుంటే ఆమె వెనక వంగి వంగి వెళ్తున్న కేతిగాణ్ణి చూచి ప్రేక్షకులు విపరీ తంగా నవ్వుతూ వుంటారు. పంచ్. జూడీలకంటె కూడా మన కేతిగాడు చాలా ప్రాచీన కాలానికి చెందినవాడు. శతాబ్దాలపాటు ఆంధ్ర ప్రేక్షకులను కవ్వించి. నవ్వించి. మెప్పుపొందిన దిట్ట.

ఇక. మళ్ళీ హాస్యాన్ని కాస్త అవతలపెట్టి అసలు కథలో పడతాం. ఆటలో రెండవ భాగం ప్రారంభమౌతుంది. రావణుని దర్బారులో హను మంతుడు కనబడతాడు. మొదటి అల్పకాయుడుగా వున్న ఆ వానరశ్రేష్ఠుడు. ఇంతలోనే స్థూలరూపం తాలుస్తాడు. ఉన్నట్లుండి మహాకాయు డవుతాడు. సంభాషణల వల్లను. సూత్రధారులు కల్పించే చిత్ర విచిత్ర ధ్వని విశేషాలవల్లను ఈ ఘట్టం మహాబాగా

రక్తికడుతుంది. అనంతరం హనుమంతుడు లంకా దహనంచేసి చక్కా పోతాడు. రాముని అభీష్టం నెరవేరుతుంది. రావణ వధ జరుగుతుంది. లంకా దహన దృశ్యాన్ని తెరపై చూపడం అంత సులభ సాధ్యమైన పనికాదు. కాని, బహువిధ వర్ణాల సముచిత సమ్మేళనంతో, అద్భుత ప్రజ్ఞావిశేషంతో వారు ఈ దృశ్యాన్ని కూడా చాలా వాస్తవికంగా చూపించేవారు. తెర వెనక వుండే స్త్రీ గీతాలను పాడుతూవుండగా ఆట ముగింపుకు వస్తుంది. ఆ గీతాలను ఆమె శతాబ్దాల తరబడి పాడుతూనే వున్నది. భారత మహిళలకు ఆదర్శప్రాయురాలైన సీత అపహరణాన్ని చిత్రించే కథ ఇది. ఆమె కంఠ స్వరం నిలిచిపోగానే బొమ్మలు అంతర్థానమౌతాయి. అప్పటికే తెలతెలవారుతూ వుంటుంది.

పితార్జితంగా సంక్రమించిన "ఈ తోలుబొమ్మలాట"ను కులవిద్యగా పోషించుకొంటూ చరిత్రనో, పురాణాలనో, కథలనో తెరపై చిత్రిస్తూ వినోదం కలిగించే ఈమహనీయులను ప్రజానీక మెపుడూ గౌరవిస్తూ, ఆదరిస్తూనే వుంటుంది. అధునాతనపు సినీమాలు వచ్చిన తర్వాత కూడా తోలుబొమ్మలాటలు ఇప్పటికీ నిలిచివున్నాయి. ప్రజాహృదయాలకు సన్నిహితమైన గాథలను ప్రజాహృదయాలను చూరగొనేటట్లు ఇవి చిత్రించడమే దానికి కారణం.

రంగు రంగులతో జరిగే తోలుబొమ్మలాటలు ఇతర దేశాలలో కూడా చిరకాలంనుంచీ వర్ధిల్లినాయి. టర్కీలో దీనిని "కారాగేజ్" అంటారు. ఇండొనీషియాలో "వయాంగ్"అంటారు.వయాంగ్ ఆటలు హైందవుల పురాణగాథలనే చిత్రిస్తాయి. ఏమైనా, దేశీయ కళలపట్ల ఇప్పుడిప్పుడే తిరిగి ఆదరం ఎక్కువ అవుతున్నది. కనుక, తోలుబొమ్మలాట తిరిగి ప్రచారంలోకి వస్తుందని ఆశించవచ్చునా!

—ఆంధ్రప్రభ (29-10-50)

## సోవియట్ స్త్రీలు

రచన : ఇ. పాపవా

దేశ ఆర్థిక, సాంస్కృతిక జీవితంలోనూ, ప్రభుత్వరంగా అన్నిటిలోనూ సోవియట్ స్త్రీ ప్రముఖ పాత్ర వహిస్తుంది. సోవియట్ దేశ పుత్రికారత్నాలలోనుండి 80 మంది స్త్రీలు సోవియట్ దేశ సుప్రీమ్ సోవియట్‌కు (కేంద్ర శాసన సభ) ప్రతినిధులుగా ఎన్నుకోబడ్డారు. వారు ప్రభుత్వ పరిపాలనలో అగ్రస్థానంలో వున్నారు. సుప్రీమ్ సోవియట్‌కు ఎన్నుకోబడిన ప్రతినిధులు విశాలమైన సోవియట్ దేశంలోని వివిధ ప్రజలకూ, వివిధ వృత్తులలో వున్నవా రందరికీ ప్రాతినిధ్యం వహిస్తున్నారు. అంటే, ఫ్యాక్టరీల్లోనూ, పొలాల్లోనూ పనిచేస్తున్న స్త్రీలు వ్యవసాయంలోనూ, పరిశ్రమలలోనూ, పెద్దపెద్ద పనులలో చొరవ తీసుకున్నవారూ, శాస్త్ర విజ్ఞానవేత్తలు, డాక్టర్లూ, వ్యవసాయ శాస్త్రవేత్తలు, సాహితీవేత్తలూ, కళాకారులూ మొదలైనవారు. మాస్కోలోని "క్రెస్నోగొర్నాయా మేన్యుఫేక్చూరా" బట్టల మిల్లులో పనిచేసే ప్రఖ్యాత కార్మిక స్త్రీ అలెగ్జాండ్రా మిఖైలోవ్నా స్త్రీరోవా, అజెర్‌బెజాన్ రిపబ్లిక్కులోని కాసుమ్ ఇస్మాయిలోవ్ జిల్లాలోగల వొరిషిలోవ్ సమిష్టి వ్యవసాయక్షేత్ర సభ్యురాలైనట్టి సామ్యవాద శ్రామికవీర బిరుదు వహించినట్టి బాస్తీ బాగిరోవా, చెలైబిన్‌స్క ప్రాంతంలోని వాగ్‌ర్యాన్ జిల్లాలోగల ఎన్. జి. చెర్‌నిషేవ్ సమిష్టి వ్యవసాయ క్షేత్రానికి అధ్యక్షురాలైన జినైదా నెమనోవ్నా ముఖినా, శాస్త్ర విజ్ఞాన రంగంలో పనిచేసేదీ, వైద్యశాస్త్ర విజ్ఞాన పరిషత్తుయొక్క క్షయరోగ చికిత్సా పరిశోధనా సంస్థకు డైరెక్టరైన జినైదా అలెగ్జాండ్రోవ్నా లెబిదేవా, వానొస్తురువా నూనె ఫ్యాక్టరీలో ఇంజనీరుగా వున్న సారా వెలిఖనోవా, సోవియట్ ప్రజానటి అల్లా కాన్‌స్టాంటినోవ్నా తారసోవా,—వీరు సుప్రీమ్ సోవియట్ ప్రతినిధు లనేకులలో కొందరు.

వివిధ రిపబ్లిక్కుల శాసనసభలకు 1,700 మందికి పైగానూ స్థానిక శ్రమజీవుల ప్రతినిధుల సభలకు సుమారు 500,000 మందీ, స్త్రీలు ప్రతినిధులుగా ఎన్నుకోబడ్డారు.

టెక్నిక్కు, శాస్త్ర విజ్ఞానాలను అభివృద్ధి చెయ్యడంలోనూ, వ్యవసాయంలోనూ, పరిశ్రమల లోనూ అభివృద్ధికరమైన పెద్దమార్పులను ప్రవేశ పెట్టడంలోనూ, నూతనకళా, సాహిత్య కావ్యాలను సృష్టించడంలోనూ సోవియట్ స్త్రీలు చేసిన కృషి మహోన్నతమైనది. సామ్యవాద దేశ అభ్యుదయానికి దోహదమిచ్చే ప్రఖ్యాతకృషి చేసిన 300 మందికి పైగా స్త్రీలకు స్టాలిన్ బహుమతులు లభించేయి. మాస్కో విశ్వవిద్యాలయంలో అధ్యాపకురాలు ఎ. నోవా సెలోవా, మాస్కోలో గృహనిర్మాణ కళావేత్త జడ్. చెర్నిషేవా, "కలీబ్రి" కర్మాగారంలో ఇంజనీరు ఎమ్. కొరెంట్‌సోవా, కజాన్ మొక్కలు పెంచే ప్రభుత్వ సంస్థలో వ్యవసాయ శాస్త్రవిజ్ఞాన వేత్త కె. హెచ్. బైచురోవా, కుట్టు ఫ్యాక్టరీలలో ఫోర్‌మెనగావున్న పి. సుఖొవెర్‌కోవా, యూరల్స్ ఆటోమొబైల్ ఫ్యాక్టరీలో పనిచేస్తున్న ఎన్. నజరోవా, మాస్కో - ర్యాజాన్ రైల్వేలో పనిచేస్తున్న కె. కొరొలెవా, సమిష్టి వ్యవసాయ క్షేత్రానికి చెందిన స్త్రీ ఓ. గోనాజెంకో, లటేవియన్ రచయిత్రి ఎ. సాచ్‌సె, నర్తకి ఓ. లెపెషిన్‌స్కాయా స్టాలిన్ బహుమతు లందుకున్నవారిలో కొందరు.

సోవియట్ స్త్రీలకు శాస్త్రవిజ్ఞాన సాధనకు మార్గం తెరచివుంది. 380 మంది స్త్రీలు ప్రొఫెసర్ బిరుదాన్ని పొందేరు. సుమారు 3000 మంది మాస్టర్ ఆఫ్ సైన్సు డిగ్రీలను అందుకునివున్నారు. ఉన్నత పాఠశాలలో అధ్యాపకులుగా వున్నవారూ, శాస్త్రవిజ్ఞాన విజ్ఞానపరిశోధనా సంస్థలలో పనిచేస్తున్నవారూ కలసి 50,000 మందికి పయిగా స్త్రీ లుంటారు. సోవియట్ భూమిలోని 65 జాతులకు ప్రాతినిధ్యం వహిస్తున్న 400,000 మంది ఆడపిల్లలు ఉన్నత విద్యాసంస్థల్లో చదువుతుంటున్నారు.

ప్రజా ఆరోగ్యరంగంలో డాక్టర్లుగానూ, మంత్రసానులుగానూ, డాక్టర్లకు అసిస్టెంటులుగానూ 10 లక్షలమందికి పైగా స్త్రీలు పనిచేస్తున్నారు. ఉపాధ్యాయినులుగా 900,000 మందీ, ఇంజనీర్లుగానూ, టెక్నిషియన్లుగానూ 327,000 మందీ స్త్రీలు పని చేస్తున్నారు. జాతీయ ఆర్థిక రంగంలో వున్నత విద్యావంతులైన ప్రవీణులలో సగంమంది స్త్రీలు. స్టాఖనోవైట్ వర్కర్లయిన మేరియా వోల్కొవా, నటాలియా యారిగీనా, క్లావ్‌డియాడినోవా, మేరియా రోజ్‌నేవా, రియాకొనొనెంకో, వాలెంటీనా క్రిసనోవా, రిడియా కొరొబెల్ నికోవా, లిచోవ్ ఎనాసీవా, - తదితరుల పేర్లు దేశ మంతటా ప్రఖ్యాతి గాంచినవి. వీరు గడువుకు ముందుగా యుద్ధానంతర స్టాలిన్ పంచవర్ష ప్రణాళికలు సఫలం చెయ్యడంలో దేశమంతటా వ్యాపించిన సామ్యవాద పోటీ వుద్యమంలో మహత్తర విజయాలను సాధించిన వారు.

యుద్ధకాలంలో సోవియట్ స్త్రీలు వీరోచిత కృషీ, సైనిక వీరకృత్యాలూ సోవియట్ ప్రభుత్వం మెప్పుపొందేయి. 5 లక్షల మందికి పైగా స్త్రీలు పతకాలూ, బిరుదులతో గౌరవింపబడ్డారు. 69 మంది స్త్రీలకు సోవియట్ యూనియన్ వీరబిరుదం లభించింది. 1,700 మంది స్త్రీలకు సామ్యవాద శ్రామిక వీరబిరుదం బహూకరింపబడింది.

ఎవ్‌దోకియా పాస్కో, ఎకటేరీనా ర్యాచొవా, ఆంటోనీనా జుబ్‌కోవా, - ఈ సోవియట్ దేశ వీర వనితలు చావుకు లక్ష్యపెట్టక తమ మాతృభూమి స్వేచ్ఛాస్వాతంత్ర్యాలను స్వార్థరహితంగా రక్షించారు. యుద్ధానంతరం వీరు మాస్కో విశ్వవిద్యాలయంలో ప్రవేశించి విజయవంతంగా పట్టభద్రులయారు. ప్రస్తుతం పోస్టుగ్రేద్యుయేటు విద్య నభ్యసిస్తున్నారు.

"కరవావో" ప్రభుత్వ వ్యవసాయక్షేత్రంలో పని చేస్తున్న లిడియా సిటుష్‌కినా, కలినిన్ ప్రాంతం

లోని ఇల్లిచ్ సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో దళ నాయకురాలు అలెగ్జాంద్రా కొరొలేవా, అబ్‌హాజియా లోని లెనిన్ వ్యవసాయ క్షేత్రంలో దళనాయకురాలు ఇవ్‌దోకియా బాస్కాకోవా, "జావటీ ఇల్లిచ్" వ్యవసాయ క్షేత్రానికి చెందిన ఎక్సీనియా వినొకు రోవా తదితర సామ్యవాద వ్యవసాయ ప్రవీణులూ, సామ్యవాదశ్రామిక వీర బిరుదాన్ని అందుకొన్న వారిలో కొందరు. అధిక పంటలు పండించడానికీ, పశుగణాభివృద్ధికీ, ప్రకృతిని మార్చివేయడానికి వీరు ధైర్యంగా పోరాటం సాగిస్తున్నారు.

సోవియట్ స్త్రీయొక్క వీరోచిత శ్రమను అభినందిస్తూ జె. వి. స్టాలిన్, "ఇటువంటి స్త్రీలు పురాతన కాలంలోలేరు, వుండడానికి అవకాశం లేదు." అని అన్నారు.

—టాస్ (7 అక్టోబరు 50)

## యూరల్స్‌లో పిల్లల కళాభ్యాసం

బాలబాలికలు సర్వతోముఖమైనట్టి విద్య గరపడానికి సోవియట్ ప్రభుత్వం నిత్యం శ్రద్ధ వహిస్తుంది. సోవియట్ స్కూలు పిల్లల జీవితంలో నృత్యం, సంగీతం చాల ముఖ్యమైనవి.

పాఠశాలలకు చెందిన అనేక క్లబ్బుల్లోనూ, బాల కేంద్రాల్లోనూ సోవియటు బాలబాలికలు తమ కళా సామర్థ్యాలను అభివృద్ధి చేసుకోవడానికి అన్ని అవకాశాలు వున్నాయి. ఏదో వొక కళలో సామర్థ్యం ప్రదర్శించే పిల్లలకు పిల్లల సంగీత, నృత్య పాఠశాలలో ప్రత్యేకంగా విద్య నభ్యసించడానికి అవకాశ మివ్వబడుతుంది. ఈనాటి అనేక ప్రఖ్యాత సోవియటు కళాకారులు మొదటిలో పిల్లల అమెచ్యూర్ కళాకేంద్రాల్లో విద్య నభ్యసించినవారే. ఆ కళే తరువాత వారికి వృత్తి అయింది.

అనేకమంది పిల్లలు అమెచ్యూర్ కళను తమ ప్రియమైన విద్యగా భావిస్తారు. తమ తీరికవేళ నంతా దానికోసమే వినియోగిస్తారు.

అమెచ్యూర్ కళా పునరీక్షణ ప్రదర్శనాలు జరిగినప్పుడు పిల్లలు నిజంగా సెలవు దినాలు అనుభవిస్తారు. అటువంటి ప్రదర్శనాలు జిల్లా కేంద్రాల్లోనూ, ప్రాంతీయ పట్టణాల్లోనూ, రిపబ్లిక్కుల్లోనూ జరుగుతాయి.

—టాస్ (4 అక్టోబరు 50)

## 'సత్య అహింస'లకు జన్మదినం

రచన : శ్రీ వేలూరి సహజానందం

అక్టోబరు 2 న ఇంటింట జరిగే పుట్టినరోజు పండగ. ఒక్క మతస్థులకు, ఒక్క ప్రాంతీయులకు, ఒక్క దేశస్థులకుమాత్రమే కాదు ఈ పుణ్యదినం సర్వజనులకు, అన్ని ప్రాంతాలవారికి, ప్రపంచమంతటా స్మరించుకునే పవిత్రదినం.

దరిద్రులు, ధనవంతులు, బానిసదేశాలు, స్వతంత్ర దేశాలు అందరూ చేసుకొనే పండగ.

ముఖ్యంగా మన దేశంలో ఈనాడు ప్రజలందరూ "గాంధీజీకి జై" అంటూ ఉత్సవాలు చేస్తారు. ఊరేగింపులు జరుపుతారు. జెండా లెగురవేస్తారు. తెల్లని ఖద్దరు ధరిస్తారు. సత్యం, అహింస అంటూ జపిస్తారు.

ఏడాది కొకసారి జరిగే ముచ్చట. ఒక యుద్ధం గెల్చిన వీరునివలె, మంత్రశక్తితో మహిమలు చేసిన మాంత్రికునివలె, ఏదో కొత్తమతాన్ని నిర్వచించిన ఉపదేశకునివలె కాదు గాంధీజీని ఎక్కువగా స్మరించేది ప్రజలు.

జనసమూహాలను సంఘటితపరచి, ఒక్క తాటి మీద నడిపించినందుకుకూడా కాదు. హరిజనోద్ధరణకూ కాదు. ఆర్థికసమానత్వంకోసం ఆయన చేసిన ప్రబోధం గురించీ కాదు. ఫలసిద్ధి తర్వాత

జనసమూహాలు నాయకుని విస్మరించవచ్చు. ఉచ్చ స్థితికి వచ్చాక పతితులూ ఈ ఉద్ధారకుని విస్మరించ వచ్చు. దారిద్ర్యకూపంలోంచి బైటపడ్డాక ప్రజలు ఈ సమత్వప్రబోధకుని మఱచిపోవచ్చు. స్వరాజ్యంతో కైపెక్కిన దేశస్థులు నిర్మాతను మఱచి పోవచ్చు.

కాని ఇంతటితో, వీరి మఱపుతో మరుగున పడిపోయేవాడు కాదు గాంధీజీ. పై చెప్పిన పనులు మటుకే గాంధీజీ చేసివుంటే, నేడు కాకపోతే రేపైనా గతానికి గుర్తుగా మటుకే చరిత్రవీథిన గోచరించేవాడు. ఈ పనులు ఎంత ఉపయోగకర మైనవైనా ఇవి గాంధీజీయొక్క జీవితసత్యం కాజాలవు. మహాత్మునికి సత్యాన్వేషణే జీవితము. ఈ సత్యాన్వేషణలో లభించినవే హరిజనోద్ధరణ, స్వరాజ్యం వగైరా.

కేవలం సంస్కారంకోసం కృషిచేసిన మహనీయు లున్నారు. అలాగే కేవలం రాజకీయ, ఆర్థిక దురన్యాయాలను నిర్మూలించిన వీరు లున్నారు. కేవలం సంస్కృతినే ప్రబోధించిన ప్రబోధకు లున్నారు. కాని వీరి కృషి అసంపూర్ణము. జీవితముయొక్క సంపూర్ణస్వరూపము వీరి కదృశ్యము. జీవితాకాశములోని ఏ ఒక దిక్కులోని చీకటో, వెలుతురో వీరి కగపడేది. గాంధీజీవి సత్యచక్షువులు. వాటికి జీవితంయొక్క హ్రస్వ రూపాలు కాక, యావత్తుచిత్రమూ గోచరమౌతుంది. జీవితంలో సత్యంయొక్క వెలుతురు సోకని కోణం ఉండదు. సత్యాన్వేషణే జీవిక అయిన జీవుల పద చిహ్నాలు జీవనక్షేత్రమందంతటా కనిపిస్తాయ్.

గాంధీజీని అనుసరించటమంటే, ఆయన ప్రధాన సాధనను అనుసరించటం. సత్యాన్వేషణను అనుసరించటం.

ఇవ్వాళ ప్రభుత్వం, మంత్రులు, ఉద్యోగస్థులు కాంగ్రెసు పార్టీ, ఇతరపార్టీలు, ప్రజలు యావన్మందీ ఈ ప్రాగ్దిశాజ్యోతి సత్యాన్వేషణవైపు తిరిగి, ఆ వెల్తురుతో ఉత్తేజితు లవాలి. నిజంగా దేశాభ్యుదయం, విశ్వాభ్యుదయం. కోరేవారిలో ఈనాడు ఒక్కడైనా సత్యాన్వేషణనే జీవిత ధర్మంగా ఎంచి జీవిస్తే చాలు. దేశం తేజస్సుతో, జీవంతో కలకల లాడుతుంది.

గాంధీజీని ఆరాధించే ప్రజల మధ్య, రాజకీయ హత్యలు, ప్రభుత్వ దౌర్జన్యం, చీకటి వ్యాపారం, ప్రజల మూఢత్వం, నిర్లిప్తత విచ్చలవిడిగా విహరిస్తున్నయ్. ఇవన్నీ జరుపుతూ చేసే గాంధీజీ ఆరాధన ఆరాధనకాదు. వంచన. హత్య. గాంధీజీ శరీరాన్ని పిస్టలుతో పేల్చి ఆయన సందేశాన్ని విశ్వమంతట ప్రతిధ్వనింపజేశాడు హంతకుడు. కాని ఈ స్వార్థభక్తులు ఆయన పటాలకు మోకరిల్లి ఆయన సందేశాన్ని కాళ్ళతొక్కుతున్నారు.

గాంధీజీ జన్మించిన నేడు ఏ ఒకని మనస్సులోనైననూ నిశ్చలమైన నిర్మలమైన సత్యాన్వేషణ జనిస్తే, అది మహా సుముహూర్తం. అది సుప్రభాతం! సత్యానికి పునర్జన్మ—మనుష్య కుటుంబంలో.

—భారతి (అక్టోబర్ 50)

## డాక్టర్ పి. వి. పతి:
## ఇండియాలో "డ్యాకుమెంటరీ" నిర్మాత

రచన : శ్రీ సుబ్బారావు

ప్రపంచంలోనేమి, భారతదేశంలోనేమి ప్రతి జాతికి ఒక విశిష్టత వుంది. ఇక్కడ తమిళులకు కార్యదక్షత, గుజరాతీలకు వాణిజ్య మనఃప్రవృత్తి, బెంగాలీలకు భావుకత విశేషం. ఆంధ్రులకు పట్టుదల లేకపోవడం లోపమే కావచ్చుగాని వారి విశిష్ట లక్షణంమాత్రం నవ్యత్వం, నిత్య నూతనత్వం. కవితలో వారిది కొత్తపోకడ. దానికి 2,000 ఏండ్ల నాటి హాలుడు సాక్షి. కథాకల్పనంలో వారిది కొత్తదనం. దానికి గుణాఢ్యుడు నిదర్శనం. లలిత

కళలలో వారిది నూతనపథం. దానికి అజంతా, అమరావతి, ఎల్లోరాలే తార్కాణలు. వాస్తుశాస్త్రం లోను వారి తీరే వేరు. అంబరచుంబి విజయనగర గోపురాలు, సుదీర్ఘ సువిశాల కళ్యాణ మండపాలు దీని ఉదాహరణాలు. అనాదిగా ఆంధ్ర జాతికివున్న ఈ నవ్యతావరణం శ్రీపతిగారిలో మాత్రం లోప మౌతుందా? నాడు లలితకళలలో నూతనత్వం చూపిన ఆంధ్రజాతి ప్రతినిధి శ్రీపతిగారే నేడు చలనచిత్రకళలో నవశకారంభకులైనారు.

పతిగారి జననం చెన్నపురిలో 1906 జూన్ మాసంలో. కళాప్రపూర్ణమైన వాతావరణం వారి ఆట పాటలు. తండ్రి కృష్ణశర్మగారికి గ్రామఫోన్ కంపెనీలో పని. తల్లి సుబ్బాయమ్మగారు చిత్రకళారాధకురాలు. ఆమె చిత్రలేఖనం పతిగారి లేత మనసులో లలితకళా బీజాలు నాటినవి. ఆమె అనేక లలిత కళా ప్రదర్శనాలను ఏర్పాటుచేసి తనయునికూడా వెంటతీసుకొనిపోయేవారు. కాళిదాసు శకుంతలం మున్నగు మహానాటకాలను చిత్రాలుగా రచించి బోధించేవారు. ఆ మహాతల్లి చల్లని చేతి చిత్రాలు, తియ్యని పలుకులు వారి హృదయక్షేత్రంలో నాటిన బీజాలకు అమృతం పోసి అంకురింపచేశాయి. క్రమంగా పతిగారిలోనూ తన ఆశయాలు చిగురించినవి. లలితకళలను ధ్యానంచేస్తూ స్కూలు ఫైనల్‌వరకు గడిపేశారు. పచ్చయప్ప కాలేజీలో ఇంటర్మీడియెటు తరగతిలో ప్రవేశించక తప్పింది కాదు. అయినా, కాలేజీకంటె కళలమీదే వారి మనసు. చదువుమీద విరక్తి పరాకాష్ఠ నందుకొనడానికి సంవత్సరమైనా పట్టలేదు. ఈ పరిణామం పతిగారి కెంత ఆనందకరమో తండ్రిగారికికూడా అంత అహ్లాదకరమైంది. వెంటనే చలనచిత్ర కళలో శిక్షణపొందడానికి బొంబాయి పంపారు.

1929 వ సంవత్సరం జులై, ఆగస్టు మాసాల మధ్య మాటది. బొంబాయినుంచి తిన్నగా ప్యారిస్ చేరుకొన్నారు. "స్కూల్ ఆఫ్ సినిమాటగ్రఫీ" లో పట్టా పొందారు. తదనంతరం లేబరేటరీ టెక్నిక్, ఫిల్ము ప్రాసెసింగ్, ప్రింటింగ్, ఎడిటింగ్‌లలో కొలదినెలలూ, సంవత్సరంపాటు వెస్టెరన్ ఎలక్ట్రిక్ రికార్డింగ్ సిస్టంలోను శిక్షణ పొందారు. ఈ శిక్షణ కాలంలో డాక్యుమెంటరీ చిత్రాలు విద్యా విజ్ఞాన ప్రబోధకచిత్రాలు తరచుగా ప్రదర్శించబడేవి. పతిగారి భావనాపథంపై వాటి ప్రభావం బాగా ప్రసరించింది. నిత్యజీవితంపై, వాస్తవికతపై వారిదృష్టి మరలింది. వాస్తవిక జగత్తుకు సెల్యులాయిడ్‌లో శాశ్వత రూపమిచ్చినట్టయితే ఇప్పటికాలం వారి కది విజ్ఞానదాయకం కాగలదని, భావితరాలవారి కది చారిత్రకాధారం కాగలదని క్రమంగా విశ్వసించారు.

1942 వ సంవత్సరాంతంలో మిస్టర్ హారెన్ ఆష్టన్ "సహారా ఎడారి"పై గొప్ప డాక్యుమెంటరీ చిత్రం నిర్మించ సంకల్పించారు. అప్పుడే యూరప్ పర్యటననుంచి ప్యారిస్‌కు తిరిగివచ్చిన డాక్టర్ పతిగారిపయి ఆయన దృష్టి పడింది.

ఆయనకు అసిస్టెంటు కమెరామన్‌గా పనిచేయడానికి పతిగారు అంగీకరించారు. ఉభయులూ ఫ్రెంచి ఉత్తర ఆఫ్రికాలోని అల్జీరియాకు పయనమైవెళ్లారు. "స్వర్ణకళా ప్రపంచం" సహారాలో ఎండలను, సుడిగాడ్పులను, ధూళి ధుమారాన్ని క్రీడగా గణించి ఉభయులూ ప్రకృతిశోభను సెల్యులాయిడ్‌లో బంధించారు. ఒక సంసారానికి సరిపోయే సరంజాముతో గాడిదలపయి తామప్పుడు చేసిన విహారం మరపుకు రాదంటారు పతిగారు. అక్కడి ప్రజానీకపు జీవిత విధానాలు పతిగారిని మిక్కుటంగా ఆకర్షించాయి. వాస్తవ విషయ చిత్రణపయి వారి మనస్సు సుస్థిరంగా లగ్నమైంది. ఈ చిత్ర నిర్మాణ సమయంలోనే—అల్జీరియా సందర్శనే—వారి జీవితాన్ని డాక్యుమెంటరీ చిత్రాలకు అంకితం చేయడానికి ప్రముఖంగా కారణమైంది.

క్వెట్టాలో భూకంపం వచ్చింది. అమెరికాలోని యూనివర్సల్ న్యూస్ కార్పొరేషన్‌వారు పతిగారికి కేబుల్ పంపి భూకంప దృశ్యాలను ఫిల్ముగా తీయవలసిందని విజ్ఞప్తి చేశారు. పతిగారు క్వెట్టాకు

విమానంలో వెళ్ళి ఆ దృశ్యాలను చిత్రించారు. యూనివర్సల్ న్యూస్‌లో భాగంగా ప్రపంచం మొత్తంపై అవి ప్రదర్శించబడినవి. వారి కెమెరాయే దేశదేశాలకు క్వెట్టా ఆర్తనాదం వినిపింపచేసింది.

1936 వ సంవత్సరంలోనే పతిగారు భారత చలనచిత్ర చరిత్రలో నూతనశకానికి నాందివాచకం చదివారు. ఇక్కడ మున్నెన్నడు లేని డాక్యు మెంటరీ ("డాక్యుమెంటయిర్" అనే ఫ్రెంచిపదం నుంచి ఉద్భవించిన ఆంగ్లపదం "డాక్యుమెంటరీ" దీని అర్థం వాస్తవ విషయ చిత్రణ అన్నమాట) చిత్రం "ది ఇండియన్ కాటన్" నిర్మించారు. పత్తివిత్తు నాటింది మొదలు బట్టలబేళ్లు బిగించేవరకు గల వందలాది ఘట్టాలను అక్కడక్కడ గ్రాపులతో, పటాలతో మరింత ఆకర్షణీయం చేస్తూ పొందికగా 1,000 అడుగులలో చిత్రం పూర్తి చేశారు.

ఫ్రాన్సుకు రైలుమార్గాలు, బ్రిటనుకు మత్స్య పరిశ్రమ, అమెరికాకు విజ్ఞాన శాస్త్ర పరిశోధన, సోవియటు రష్యాకు అక్టోబర్ విప్లవం తొలి డాక్యుమెంటరీలైతే భారతదేశాని "పత్తిపంట" ప్రథమ విద్యా ప్రబోధక చిత్రమైంది.

1938 లో పతిగారు చలనచిత్ర చరిత్రలో మరొక యుగం ప్రారంభించారు. ఆ సంవత్సరంలో జరిగిన "హరిపుర కాంగ్రెస్"ను "టాకీవార్తాచిత్రం" గా నిర్మించారు. భారతదేశాని కది మొట్టమొదటి టాకీ వార్తాచిత్రం. 52 ఎడ్ల జతల రథంపై రాష్ట్రపతి ఊరేగింపు దృశ్యాన్ని, లక్షలాది ప్రేక్షకులు పాల్గొన్న మహాసభ తదితర దృశ్యాలను "టాప్ షాట్సు," "లాంగ్ షాట్సు"లో మనోజ్ఞంగా చిత్రించారు. అంతటి సమూహంలోను పతిగారి కెమెరా సుభాష్ బాబును, "క్లోజప్"లో "క్యాచ్" చేసింది, మహాసభలో రాష్ట్రపతి సుభాష్ బాబు, మహాత్మా గాంధి ఉపన్యాసాలకు రికార్డుచేశారు. చిత్రం విడు

దలానంతరం తెరపై నాయకులు ప్రసంగించడం తొలుదొల్త విన్న ప్రజానీకం ఆనందానికి అవధులు లేకపోయినవి.

పతిగారు భారతదేశానికే కాక సమస్త ప్రపంచానికి సమర్పించిన అమూల్యమైన కానుక— "గాంధీజీ జీవిత చరిత్ర".

1937 నుంచీ పతిగారు గాంధీజీకి సన్నిహిత సహచరులైనారు. గాంధీ పూర్వ జీవితానికి సంబంధించిన అనేక విషయాలను, వస్తువిశేషాలను సేకరిస్తూ వచ్చారు. బాపూజీ నడిపిన మహోద్యమాలనే కాక ఆయన పాల్గొన్న ప్రతికార్యక్రమాన్నీ ఫిల్ము తీస్తూవచ్చారు. ఈరీతిని ఐదేండ్లు నిర్విరామంగా పరిశ్రమించారు. సేకరించిన భాగాలను పొందికగా 12 రీళ్లలో కూర్చి "మహాత్మా గాంధీ" అనే డాక్యుమెంటరీ ఫిల్ముగా తెలుగు, తమిళ భాషలలో విడుదల చేశారు. రెండింటికీ పతిగారే దర్శకులు.

నాడు పతిగారే పూనుకొని వుండకపోతే నేడు మహాత్ముని మహనీయగాథను వెండితెరపై చూచే భాగ్యం మనకు లేకపోయేది. భారతదేశ చరిత్రకు గాంధీజీ జీవితచరిత్రకు అవినాభావం కలదు. కాబట్టి పతిగారు జాగ్రద్భారతదేశ చరిత్రనే డాక్యుమెంటరీగా తీశారని చెప్పాలి. మాతృదేశానికి నాయకులు రాజకీయ రంగంలో చేసిన సేవను పతిగారు ఫిల్ము రంగంలో చేశారు. వీరి కృషి అసదృశం.

పతిగారు దేశ విదేశాలలో నిర్మించిన డాక్యుమెంటరీ చిత్రాలకు స్వయంగా "స్టోరీ" (చిత్రాంశం గత చరిత్ర; ప్రస్తుత చరిత్ర). "స్క్రిప్టు" (చిత్రాంశాల వివరణ) విరచిస్తారు. బొంబాయిలోని ఒక డాక్యుమెంటరీ యూనిటుకు "భారతీయ నృత్యాలు," "పానపిశాచి'' అనే చిత్రాలకు స్క్రిప్టు వ్రాసి యిచ్చారు.

1948 సంవత్సరంతో "గాంధీ జీవిత చరిత్ర" చిత్రాన్ని హిందీలో కూడా తీశారు. బొంబాయి ప్రభుత్వం దృశ్యవిద్యాశాఖకు రెండు సంవత్సరాలు సలహాదారుగా వ్యవహరించారు.

ప్రస్తుతం ఆంధ్ర సమగ్ర చరిత్ర పరిశీలనలో నిమగ్నులై వున్నారు. ఆంధ్రుల జీవితానికి శోభ నిచ్చిన జానపద నృత్యాలు, గేయాలు, శిల్పం, వాస్తు శాస్త్రం ఆధారంగా మూడురీళ్ళ డాక్యుమెంటరీ చిత్రాన్ని నిర్మించ సంకల్పించినట్లు కూడా తోస్తున్నది.

సినిమా రంగంలోనే కాక సాహితీరంగంలో కూడా పతిగారిది అందెవేసిన చేయి. పత్రికా రచనలో ముఖ్యంగా చిత్రాధార రచనాపారంగంలో (పిక్టోరియల్ జర్నలిజం) వీరి ప్రజ్ఞా ప్రాభవాలు విశేషం. భారతదేశ చరిత్ర సంగ్రహ స్వరూప మనదగు "పిక్చర్స్ అండ్ పెన్ పిక్చర్స్ ఆఫ్ ఇండియా" అనే ఉద్గ్రంథాన్ని ఆంగ్లంలో రచించారు. దీనికి తమిళ భాషాంతరీకరణ కూడా చేయబడింది. ఇప్పుడు ఆంధ్రుల సమగ్ర చరిత్రను వర్ణచిత్రాలతో గ్రంథరూపంలో సమర్పించడానికి ఉద్యమించుతున్నారు. భారతదేశంలోని ప్రముఖ పత్రికలకేకాక లండన్ టైమ్సు (ఇండియన్ ఇంజనీరింగ్ సప్లిమెంటు), ఫ్రెంచి పత్రికలు వీరి వ్యాసరాజాలతో విరాజిల్లినవి. వీరు విరచించిన చిత్రపటాధార చరిత్రలు బొంబాయి, కలకత్తా, ఢిల్లీ, మద్రాసు, అలహాబాదు మున్నగు నగరాల నుంచి వెలువడే ప్రముఖ పత్రికలలో ప్రచురితమైనాయి. ప్రచురితమౌతున్నవి కూడా. ఈ చరిత్రలలో కాశ్మీర్ మొదలు కన్యాకుమారివరకు, కరాచీ మొదలు మణిపూర్ వరకుకల ప్రధానమైన మజిలీలన్నీ వర్ణితమైనవి. వీటన్నింటిని స్వయంగా సందర్శించారు. భారతదేశం మొత్తంపై వీరు సందర్శించని స్రవంతి లేదు, పరికించని రమణీయ ప్రకృతిలేదు, చూడని చారిత్రక విశేషం లేదు. చిత్రరూపంగా (అది చలన చిత్రంగానైనా,ఛాయాగ్రహణ చిత్రంగానైనా) తీయని విచిత్రం లేదు, కెమెరాతోనే దృశ్యాలపై వ్యాఖ్యానం చెప్పించే నైపుణిలో వీ రసమానులు. కెమేరా కదలికతోనే నవరసాలు గుప్పించే ప్రజ్ఞానిధి వీరు. ఇందుకు "యమునా నదీతీరం," "కుర్వాండి రోడ్డు," "బికనీర్ స్వర్ణోత్సవా"లే తార్కాణాలు.

Printed by P. S. Venugopalaswamy Naidu at Vinodhan Press 33, Jones St. Madras-1
Published by P. Mira Bai at 16, Jones St., Madras-1. Editor: P. Mallikarjuna Rao.